# ముందు ఈవిధంగా దిద్దుకోండి.

| పేజి | | పంక్తి | |
|---|---|---|---|
| 1 | (క్రిందనుంచి) | 5 | c/of గంగానమ్మ |
| 3 | (పైనుంచి) | 15 | అల్పులు. |
| 6 | ,, | 10 | అని. |
| 8 | ,, | 1 | నించడం |
| 8 | ,, | 12 | లేనిదానికై, |
| 8 | ,, | 14 | చాలకాదు. |
| 9 | ,, | 8 | వీటిలో ఏవొక్కటో చాలు. |
| 10 | ,, | 15 | ఐతే, మీనించి |
| 10 | ,, | 16 | సౌందర్యతృష్ణ |
| 14 | ,, | 7 | పారేసేవాడు; |
| 14 | ,, | 8 | కుంగిపోయ్యేవాడు; |
| 14 | ,, | 9 | ఆనందపడలేనివాడు; |
| 15 | ,, | 5 | కావొచ్చు. |
| 15 | (క్రిందనుంచి) | 5 | "ఒకవాడు |
| 15 | ,, | 4 | నన్ను |
| 20 | (పైనుంచి) | 10 | వానిటీ (vanity) |
| 22 | ,, | 3 | చూసేవాణ్ణి. |
| 22 | (క్రిందనుంచి) | 10 | అనిపించే |
| 29 | ,, | 8 | సాకుతున్న కుక్క |
| 29 | ,, | 2 | ప్రాంతపుస్త్రీలు |
| 31 | (పైనుంచి) | 5 | పమిట |
| 32 | ,, | 18 | c/of గంగానమ్మ |
| 36 | (క్రిందనుంచి) | 12 | చుట్టుపక్కల పర్వత శిఖరాల ఛాయలన్నీ |
| 38 | ,, | 12 | హంపీ శిలలకింద |
| 40 | (పైనుంచి) | 8 | out cast. |

| | | | |
|---|---|---|---|
| 41 | (క్రిందనుంచి) | 11 | ప్రేమలేదని. |
| 42 | (పైనుంచి) | 5 | కరుగుతుందని |
| 44 | ,, | 2 | తప్పు! 'వెధవస్టైలూ' |
| 46 | ,, | 12 | "ఇదంతా శైలిచేసే ఇంద్రజాలం." కాదు. ఇట్లాంటివి వున్నాయి. |
| 46 | (క్రిందనుంచి) | 7 | ఇంకా చీకట్లో |
| 49 | (పైనుంచి) | 8 | మంచివాడన్నమాట. |
| 50 | (క్రిందనుంచి) | 12 | మానవివి. |
| 52 | ,, | 16 | last word |
| 54 | ,, | 2 | అభాగ్యులం |
| 55 | ,, | 15 | అందరివాళ్లే......" |
| 61 | ,, | 13 | తెలీక పోలేదు. |
| 61 | ,, | 7 | గనాలప్పటికీ |
| 63 | ,, | 5 | దీనితరవాత |
| 65 | (పైనుంచి) | 10 | అన్వేషణా,...... |
| 65 | ,, | 16 | సంపాయించాలని కవికి మనసు లేక |
| 67 | ,, | 4 | మెరుగులొలించికూడా పొందాలి |
| 67 | ,, | 5 | ఆనందం ఇచ్చేటంత |
| 71 | (క్రిందనుంచి) | 7 | 'సీత' |
| 72 | (పైనుంచి) | 10 | ఆయన ఆమెని |
| 72 | ,, | 12 | తెలియజేస్తోంది?" |
| 72 | ,, | 14 | శ్రీకృష్ణుడి చక్రం చూడండి." |
| 75 | (పైనుంచి) | 12 | But thine |
| 77 | ,, | 10 | ట్యూషన్లు అని |
| 79 | ,, | 4 | లెక్ఖలూ. |
| 81 | ,, | 5 | తీర్చుకుంటారు. |
| 84 | (క్రిందనుంచి) | 13 | అన్నారుగా?" |
| 84 | ,, | 12 | "అవును. కారణాలు చూపాను" |

| | | | |
|---|---|---|---|
| 85 | (పైనుంచి) | 2 | సన్నిహితుడు, ద్విజలకి. |
| 85 | ,, | 8 | “ఏం మారింది లోకం?” అంటే? |
| 85 | (క్రిందనుంచి) | 3 | స్తోత్రాలూ చాలా? |
| 89 | ,, | 14 | నవ్వాలని, |
| 90 | (పైనుంచి) | 1 | ఆమెకి_భోజనం |
| 90 | ,, | 8 | ఓగంట తరవాత? |
| 90 | ,, | 14 | మాంసపుముద్ద— |
| 95 | ,, | 2 | చిఱుగుడ్డ భార్య |

మా 15 వ కానుక

# దీక్షితులుగారికి లేఖలు

‘చలం’

# MUSINGS

గుండ్రగా బలిసిన పిల్లి యెండలో పడుకునివుంది — తెల్లని పిల్లి. దాన్ని చూస్తే మా వూళ్ళో నిత్యసంతోషిగా కనపడే స్త్రీ సంఘోద్ధారకురాలు ఒకామె జ్ఞాపక మొస్తోంది. చాలామంది కిట్లా గట్టి పోలికలుంటాయి. ఒక మిత్రుడి మొహం దేనినో పోలివుందని, ఆ వుపమానం మనసుకి స్ఫురించక చాలా నెలలు వూరుకున్నాను. మొన్న బస్సుకి అడ్డంగా నుంచున్న ఒక ఒంటెను చూసేటప్పటికి ఆ వొంటె మూతికోసం ఇన్నాళ్ళు వెతుకుతున్నా ననిపించింది. ఆ పిల్లి యిట్లా పడుకుందా ఎండలో కళ్ళుమూసుకుని, దాని కళ్ళు చుట్టూ ఎగిరే పిచ్చికలమీదే వున్నాయి. దానికి ఆ పిచ్చికలు యీకలు కట్టుకున్న లడ్డుండల్లాగూ, ఎగిరే ఇడ్డెనల్లాగూ కనిపిస్తాయిగావును! చేతులో కానీలేక మిఠాయి దుకాణంముందు నుంచున్న కుర్రాడి బాధగావును దానికి! పిల్లి జన్మలో పాపం అనుభవించే పద్ధతి అదేమో!

చెరువునించి నీళ్లు మోస్తో సీత గుమ్మంముందునించి వెళ్ళినప్పుడల్లా నావంక చూస్తోంది. ఏమిటా ఆకర్షణ? పట్టణం మొగవాడు. అధికారి. అదిగాక పూర్వానుభవాల స్మరణ కొంతవరకు పనిచెయ్యవొచ్చు. ఏమిటా ఆశ? ఏమో! ఏ ఐదు నిమషాలో దొరకవా అనా? అంతమాత్రము యోచనా వుండదు. పిల్లి అట్లా పిచ్చికలవంక ఎందుకు చూస్తూవుంది? ఏమిటా ఆశ? ఏమీలేదు అట్లానే! అంతే సాధారణంగా యీ సంబంధాలలో దొరికేది ఆ ఐదునిమషాలే. అట్లాంటప్పుడు కవిత్వానికీ రొమాన్సుకీ వ్యవధి యేదీ? అందువల్లనే స్త్రీకి ప్రేమ అనగానే కటికినేల జ్ఞాపకం వొస్తుంది, యీ పల్లెటూళ్ళలో- ముఖ్యంగా కనిగిరిలో! ఏం? సుబ్బారావ్ ౦% గంగానమ్మ! ఏమంటారు?

పురుషుణ్ణి వెతుక్కో—డానికి అలవాటయిన స్త్రీ చూపులు అదోవిధంగా తయారవుతాయి వేశ్యచూపులు వేరు. అవి ధనంకోసం వెతుకుతాయి. ఈ స్త్రీల చూపులు మోహంకోసం - కాదు అవయ

వాటికోసం వెతుకుతున్నాయా అన్నంత అసహ్యంగా వుంటాయి. మరి — వ్యక్తికి దేహమంతా, (మనసుకూడా నేమో!) అంతాకూడా ఒక్క అవయవంచుట్టూ యేర్పడ్డ సహాయక ప్రదేశంవలె వుంటుంది.

కొంతమంది స్త్రీలలో ఆకర్షణ పువ్వుల్నీ, చల్లని నీలపునీటినీ, జ్ఞాపకం తెస్తుంది. ఎంతైనా కళ్ళవేపూ పెదవుల వైపే నిలుస్తుంది ఆరాధకుడి దృష్టి. స్త్రీలో ఔన్నత్యం తెలుసుకున్నప్పుడల్లా చి- జ్ఞాపకం వస్తుంది. నేను చేసిన నిరాకరణా, ఆత్మత్యాగమూ అనవసరము అర్థవిహీనమూనా? ఇట్లాంటి సంయోగాలకీ వియోగాలకీ ఆ రెంటిమధ్యా, వ్యక్తిపై బాధించిన సంకోచాలకీ, త్యాగాలకీ, విచారాలకీ అంతం, సాఫల్యం, యేమైనా వుందా, లేక ఆ అనుభవమే ఆ త్యాగమిచ్చిన మాధుర్యమే అంతమా? కాని ఇంకేం సఫలం కావాలి? చి—ని మళ్ళీ కలుసుకోవాలా? ఈ లోకంలోనో ఇంకో లోకంలోనో ఆమెనించి కృతజ్ఞతను పొందాలా? ఇక్కడ మధ్యలో త్యజించిన ప్రేమఅనుభవాన్ని మళ్ళీ "కన్‌టిన్యూ" చెయ్యాలా? ఇట్లాంటి ప్రశ్నలకి ఇష్టమయిన 'హోప్‌ఫుల్' సమాధానాలు చెప్పుకుని ఎంతమంది ఆ కలలలో ఆనంద పడడం లేదు? ఈ త్యాగాలకి హర్షించి భగవంతుడు ఊర్ధ్వలోకాలు కటాక్షిస్తాడనీ, ఇంకోజన్మలో సౌఖ్యాలు ఏర్పాటుచేస్తాడనీ, ఆమెనే ప్రియురాల్ని చేస్తాడనీ, కరుణించి ఆ వ్యక్తినే ముసలితనములో ప్రసాదిస్తాడనీ ఎంతమంది, ఎన్ని మతాలవారు, ఎన్ని విధాల నమ్మటంలేదు! ముఖ్యంగా కర్మలో నమ్మే యీ దేశస్థులకి ప్రతిపనికీ ప్రతిఫలం యెదురుచూడడం అలవాటయిపోయింది. ప్రతిఫలం ఆ త్యాగంలో తప్ప ఇంక లేదనే నమ్మితే యిన్ని దొంగ ధర్మాలూ, కపటపు నీతివర్తనలూ, వుండవు కాని ఏ భవిష్యత్తులోనూ నమ్మకం లేని నాబోటివాళ్ళకు ఒక Idea కోసం ఆదర్శంకోసం శరీర సుఖాన్ని - అందులో ప్రేమానందాన్ని త్యాగం చెయ్యడం దుష్కరమౌతుంది. ఎవర్ని ప్రేమిస్తున్నామో వారి క్షేమానికయితేనేగాని ఏ త్యాగమూ అర్థవిహీనంగా కనపడుతుంది. కాని ఆమెక్షేమం కోసం మాత్రం నేనెందుకు త్యాగం చెయ్యాలి, ఆత్యాగంవల్ల ఆమె నా చేతులోనించి జారిపోయేటప్పుడు? అయినా నాత్యాగం ఆమెకి క్షేమమని నమ్మకమేమిటి? ఆమె నా త్యాగానికి feel అవుతుందా, నన్ను admire చేస్తుందా?

హృదయ తృప్తితప్ప సమాధానం లేదు. అంటే ... అంత రాత్మ! మతాలు బోధించే అంతరాత్మ!

అంతరాత్మ అనేది వుందా? వుంటే అందరికీ ఒకే విధమైన అంతరాత్మ! మరి దేశకాల పరిస్థితులతో మారుతుందేం?

చి—ని నేను కలుసుకోవాలని ప్రతి నిముషం హృదయం దహిస్తుంది. కాని కలుసుకుంటే! తరవాత! ఆ పునస్సమాగమంలో నించి జనించిన అగ్ని ఎన్ని జీవనాల ఆనందాన్ని ఆహుతి తీసు కుంటుంది?

—న్నా! ఏం లాభం లేదు. మనిద్దరం ఇట్లా పరితపించి మళ్లీ కలుసుకుంటేమాత్రం యీ వేదన అంతమౌతుందా? ఎంతో దగ్గరగా మనం కావిలించుకున్నా, ఎంత కాలం ఒకర్ని ఒకరం విడవ కండా కళ్ళలోకి చూసుకున్నా మనకీ హృదయ తాపం తీరుతుందా? తనివితీరా ముద్దు పెట్టుకోడం అని వ్రాస్తారుగాని నిజంగా ముద్దుల తోగాని, ఇంకా దేహ ఐక్యంవల్లగాని తనివి తీరే ప్రేమ చాలా అల్పం, ఆ మనుషులు చాలా అల్పులు, నన్ను నీకూ, నిన్ను నాకూ ఇంత ఆకర్షకంగా చేసి అగ్ని త్యాగాలకు పురికొల్పే యీ శక్తి ప్రత్యే కమయిన మన హృదయదాహం కాదు. మన ఆత్మఔన్నత్యమే ఇట్లా వేరుపరిచింది మనని నిరంతరం అగ్నితో కాలుస్తోంది.

"ఇంత పరాకా..." అని విన్నప్పుడల్లా, నిన్ను మరిచానని, ఆపాట పాడుతున్నవేమోనని వులికిపడి, నీ తేనిలో తడిసినపదాలూ, పెదవులూ, చీకట్లో నీ మాపులు, తివాసీ, అన్నిటి జ్ఞాపకాలతోనూ పరాకులో పడతాను. "ఇంతపరాకా_" నాకు కాకుండా చేశావు నువ్వు పాడి.

"ఈ నాడు నన్నిట్లా పూజిస్తున్నావు సరే. ఇదివర కెందర్ని పూజించలేదు నువ్వు?" అన్నావు.

"నీకెట్లా తెలుసు?"

"నీ కధలు; నీ లేఖలు..."

"కాని నీమీది వాంఛ వేరు."

"నమ్మాననుకో. ఇకముందు? నాకన్న నువ్వు వాంఛించే వ్యక్తి ముందు ఎప్పుడో ప్రత్యక్షమయితే..."

"కాదు."

"ఆ ఇది నమ్మను. నీవంటివాడికి ప్రత్యక్షం కాకపోదు"

"నీవంటివాడికి" అనే మాట నువ్వు యే అర్థంలో వుపయోగించావో గాని నా కేమనిపిస్తుందంటే స్త్రీలో అనేక సౌందర్యాలు చూడగలవాడికి, ఎప్పటి కప్పుడు సౌందర్యాలను కల్పించుకోగల వాడికి – అని.

అసలీ సౌందర్యం చూశాము అనుకుంటామే, అది మన మనసులు ఆ మాయను కల్పిస్తున్నాయిగావును. ఆ యింద్రజాలాన్ని కల్పించుకుని చూసే గుణం మనసుతోనే పుడుతుందిగావును! ఎవరికి వారు వారి ఆకర్షణలనూ, గుణాలనూ, రుచులనూ కల్పించుకుంటారు. అనుభవిస్తున్నామనే గుణాలనూ, రంగులనూ బాధలనూ, భయాలనూ, సౌఖ్యాలనూ, ప్రేమలనూ మనసే కల్పిస్తోంది.

పురుగు మనసు పురుగుకి పురుగులోకాన్ని కల్పించి చూపుతుంది. పక్షి మనసు పక్షికి. రాజు మనసు రాజుకి. లోభి మనసు లోభికి. అసలు యీ పురుగులూ, పక్షులూ, రాజులూ, లోభులూ యెవరూ లేరేమో! వుత్త మనసులేనేమో! అసలు ఒక్క మనసే ఇన్ని మనసులుగా లోకాలు కల్పించుకుని క్రీడిస్తోందేమో! కాని సౌందర్యాన్ని కల్పించుకోగల శక్తే నాకు వొస్తే, చి— నీ సౌందర్యాన్ని ఇంకెవరిలోనూ కల్పించుకోలేనా? కాని నువ్వు ఆధారంగాలేనిది కల్పించుకోలేను. ఎవరూ నువ్వు కారు నాకు. కాని నేను నీలో చూసిన అందాలన్నీ, ఆకర్షణలన్నీ ఇంకెవరన్నా నీలో చూడగలరా? వీల్లేదు చూడలేరు. చూడ్డానికి వీలూ లేదు. వొప్పుకోను – వారికా శక్తి వుందిఅని. కాని నీలో అంత సౌందర్యం నిజంగా లేదా? వుంటే వారి అందరికీ కనపడదా? వుంది. కాని కనపడదు. అంటాను, నాకు వెర్రా! అహంభావమా?

మన ఇంద్రియాల్ని ఒక్కరవ్వ doubt చేశామా Logic సులభంగా 'బర్క్లే' వేదాంతానికీ, శంకరాచార్యుడి వొళ్ళోకీ లాక్కెళ్ళి వొదులుతుంది మనని. ఆ మిథ్యా, వేదాంతం అన్ని ఉత్సాహాలకీ మృత్యువు. అన్ని అనుభవాలకీ ఆనందాలకీ శత్రువు. ఆ వేదాంతమే, యేదో మానసాతీతమైన ఆనందాన్నిస్తుందంటారు. నమ్మక మెట్లా? స్వర్గానికి పోదామని గంగానదిలో వురికినట్లవుతుంది.

అవును. నావంటివాడు సౌందర్యాలను కల్పించుకోలేకుండా

వుండలేదు మనసులోని ఆ గుణం నిర్మూలమైతేనేగాని! కాని నిర్మూలం అవడం అవసరమా; అదే మనసులోని జీవశక్తి. దాన్ని చంపితే మనసుని చంపినట్టే! జడత్వానికి వెళ్ళినట్టే — మనసుకి ఆ గుణం ఎట్లా వొచ్చిందంటే Heridity అని కొందరూ, పూర్వ కర్మ అని కొందరూ అంటారు.

ఇంకోటి తోస్తుంది. అవును ఇంతమందిలో ఇన్ని వొస్తువుల్లో నిరంతరమూ శృంగారాన్ని చూస్తామూ, యిందరు స్త్రీలను అమితంగా ప్రేమిస్తామూ, ఇదంతా, యీ ప్రేమ అంతా—యితర స్త్రీలలో, ప్రదేశాలలో, నాముందున్న యీ పద్మాలలో, దూరంగా వున్న పటంలోని బుద్ధుడి ముఖంలో — నేను చూసిన యీ సౌందర్యానికంతా, సూత్రం ఒకటేనేమో!

చి— నీలోని నా ఆకర్షణ, నాలోని నీఆకర్షణ. అంతా ఒకటే నేమో! ఈ విశ్వఆకర్షణలోని కిరణాలా?

ఒకరిలో ఒకరికి తృప్తి కలిగితే యీలోకంలో ప్రవహించే ఆకర్షణశక్తి మనమధ్య ప్రవహించడం మానిందన్నమాట! అట్లాంటి స్థితికి రావొద్దు మనం.

మనం కలుసుకున్న తరవాత యీ శరీరాలున్నంతవరకు మన ఆకర్షణను వ్యక్తపరుచుకునేందుకు ఒకటేమార్గం. మన హృదయాలు ఎంత ఆకాశాన విహరించినా, మన చేతులుమాత్రం తమ మామూలు స్థలాలనే విహరిస్తాయి. అందిరిలో అంతకన్న నేను ఆశించలేదు. కాని నీతో ఎందుకో అంతటితో తృప్తిపడనంటోంది నా మనసు. అందువల్ల యీ దూరం, యీ ఖైదు, యీ కాలయాపన, నాకు ఉపకారిగా వొచ్చిందా అనిపిస్తోంది. నీతోనైనా చివరికి ప్రేమకి పర్యవసాన మంతేనా? అనిపిస్తుంది నాకు. ఎన్ని ఆలింగనాల్లోనించి కూడా నీ వొంటి మెరుగునైనా నా చేతితో తీసుకోలేనే, ఎంత చూసికూడా నీ కళ్ళ కాంతిని కొంచెం ఎరువు తెచ్చుకోలేనే, నీ గడ్డంవొంపుని నాది అనలేనే, ఇంక నిన్ను,నిన్ను, నా దాన్ని— ఇంకా ఇద్దరం యింకోవిధంగా శరీరాలకన్న దగ్గిరగావొచ్చే మార్గమేదా అని వెతుకుతున్నాను. నీ పెదవుల్ని, కళ్ళని, చేతుల్ని నా వాటిని చేసుకోలేను, కావిలించుకోగలను, అంతే. కాని వాటి వెనకవున్న అందంలోని జీవాన్ని నాతో ఐక్యం చేసుకునేపద్ధతి

ఆధ్యాత్మికలోకాల్లో వుండేమోనని నా అన్వేషణ. ఆ పద్ధతే నాకు అన్యాయమైందా, నీసౌందర్య లేశం అందుకోగలిగిన శక్తి కలిగిందా విశ్వసౌందర్యాన్ని మింగగలగనా? ఎందుకంటే నువ్వు నువ్వు కావు. చి— కావు. నా చి—అంతకన్న కావు. ఈ జగత్ప్రేయసి తన సౌందర్యాన్ని నా కళ్లు చూడవని పయుదిలించి, నీ రూపాన నాకు ప్రత్యక్షమయింది. అందుకని.

ఇంత వేదాంతం వ్రాసి చివరికి నేనడిగేది ఒక్క వుత్తరం వ్రాయకూడదా! అని

ఒక మిత్రుడు వ్రాశాడు. "చివరికి మీలో యీ వేదాంతం తప్ప యింక యేమీ మిగలదేమో!" అని పొరపాటు. చివరికి నాలో యీ తీరని వాంఛతప్ప ఏమీ మిగలదేమో! ఇంత వేదాంతమూ వ్రాసి... కావలిసిందల్లా చి—నించి ఒక్క వుత్తరమేగా, యీ వేదాంతాన్నంతా మరిపించడానికి! ఇంత వేదాంతానికి కారణమూ ఆమె మానమేగా! ఆమె పంజరమేగా!! లోకంలో గొప్ప వేదాంత గ్రంథాలన్నిటికీ యిట్లాంటి విషాదకారణాలే వుండి వుంటాయని నా నమ్మకం. అంతేకాదు, సమస్తశాశ్వత ఘనకార్యాలకూ, ప్రయత్నాలకూ, వాంగ్మయాలకూ వెనక వున్నది స్త్రీ శక్తి!

"ఎప్పుడూ స్త్రీని గురించే కథలు వ్రాస్తావేం?"

అంటే జవాబు—

"ఎప్పుడూ స్త్రీనిగురించే తలుచుకుంటావేం?"

"తలుచుకోను." అంటే

"ఎందుకు తలుచుకోవు నిర్భాగ్యుడా? అంతకన్న విలువగలది నీకేం కనపడుతోంది?" అని ప్రశ్న!

శక్తి అంతా స్త్రీశక్తి. స్త్రీశక్తిని అధిగమించిన శక్తి ఏదైనా (ఏమో) వుంటే అది దివ్యశక్తి. దివ్యశక్తి ఎరగని నేను స్త్రీ శక్తి నారాధించి కథలు వ్రాశాను.

మొన్న యీ 'వీణ' లోనే గావును, ఎవరో నేను దుర్నీతినీ వ్యభిచారాన్నీ బోధిస్తున్నానని వ్రాశారని చెప్పింది సౌరీస్. ఒక పేరా చదివి వినిపించింది కూడాను.

దుర్నీతి, వ్యభిచారమూ అనే మాటల అర్థాన్ని గురించి ఒక గంట నిశ్చలంగా యోచన చేయకూడదా, ఆ వ్యాసం వ్రాయక

ముందు? అనుకున్నాను. ఒకగంట తరవాతకూడా వాటిలో విశా లార్థం గోచరించదా!

**May God help you-next birth!**

నిన్న సాయంత్రం నేనూ సౌరీన్ తామర కొలను ముందు కూర్చున్నాము. చీకటి నీళ్ళమీద కమ్ముకొసిన సమయాన. తామరా కులు నీటిమీద పరుచుకొని నిద్రపోతున్నాయి. గాలి వొచ్చి ఆకు ఒకమూల ఎత్తి పలకరిస్తే అలిసి కళ్ళు మూతలుపడ్డ ప్రియురాలివలె ప్రేమతో తప్పించుకొని మళ్ళీ పడుకుంటున్నాయి అవి. క్రమంగా యీ మనుష్యభావాల్ని చెట్లలో జడాలలో గమనించి వూహించడం నాకలవాటయిపోయింది. ప్రతిచోటా యిట్లా ప్రాణమున్నదనుకో డం, వొంటరిగా తిరగడం మాట్లాడక భావనాప్రపంచకంలో బత కడంవల్ల కలుగుతున్న మనోజాడ్యమా, లేక అభివృద్ధా? కాని నిజంగా నిజప్రపంచానికి భావనాప్రపంచానికీ భేదం కూడా నశి స్తోంది. సమస్తమూ భావనేకదా అనిపిస్తోంది. ప్రపంచం మాయ అనను కదా కొన్నాళ్ళకి! ప్రపంచం మాయ కాదు. మృత్యువే మాయ అని రూఢిగా స్వయం జ్ఞానం వల్ల అనగలిగితే!

మెల్లిగా యీ పల్లెటూరి పిల్లలు నన్ను గుర్తుపట్టి బిడియంతో సమీపిస్తున్నారు. ఆ వెనక వొక యిరవయి ఏళ్ళ యువతి వొచ్చింది. ఆమె సౌందర్యం చూసి నా చిరునవ్వు ఆమెకి నమస్కరించింది. మమ్మల్నామె తమ యింటికి ఆహ్వానించింది. ప్రశ్నలు వేసింది. నా జీవితమంతా తెలుసుకున్నప్పుడు అసూయ పడింది. నేను చాలా అదృష్టవంతుణ్ణనుకుంది.

నా జీవితానికే! ఇంటి నిండా వడ్ల బస్తాలు, వంటి నిండా నగలు, నా కళ్ళను చెదిరిస్తున్న వొంటి నిగనిగలు! ఇంతలో బయిట నుంచి వొచ్చిన సరసుడు ఆరోగ్యవంతుడు రొద్దుతో పోరాడగల బలిష్టుడు, ఆమెభర్త. ఇవన్నీ ఆమెకు అదృష్టాలుగా తోచలేదు. నాకు వొక్కసారిగా చేతులలోకి వచ్చే కాసినిరూపాయలు, నా పట్టణపు వాసనలు, నావొంటి రంగు, సౌరీన్ నాజూకూ, వింత వేషం, యివన్నీ ఆమెకేవో ఎరగని ఆరాటాల్ని ఆశల్ని కలిగిస్తున్నాయి. ఆమె కళ్ళ వెనక, మాటల వెనక ప్రోత్సహిస్తున్న భావాల్ని గమ

ంచడం చాలా సరదాగావుంది. ఆ వొక్క స్త్రీలో ఆంధ్రదేశపు పల్లెటూరుస్త్రీల హృదయం విప్పుకుంది నా కళ్ళముందు.

ఎందుకో మానవ ప్రకృతి యిట్లా! ఉన్న సంతోషాన్ని వొదిలి లేని వాటికి ఆరాటాలు జాచడం! ఈ చెరువువొడ్డున కుటీరంలో కొలనులో తామరపువ్వులవంక చూస్తూ జీవితం గడపలేమా అని సౌరిస్ సందేహం! electric fans and lightsని వొదిలి. మా మిత్రులు, యీ చెన్నపూ, పాతనా, పార్టీ, ఎప్పుడు వొదిలపోతాయో, సినీమాలూ ఊరేగింపులూ, తారగోష్ఠులూ, కష్టపడకుండా హోటల్లో ఫలహారాలూ ఎన్నటికన్నా లభ్యపడతాయో అని కళ్లలో కలలు చూపుతోంది.

ఇంత అనుభవమూ, జ్ఞానమూ వుందని లోపల పొరపడదే నేనుమాత్రం! తెలుసు, విధి నాయందు చాలాదయతో ప్రవర్తించిందని. లేనిదానికై వొచ్చిన కష్టానికై, పడేవేపనించి దృష్టిని వున్న సౌఖ్యాలవేపు తిప్పడమే wise man చేయవలసిన పని అని తెలుసు. కాని చాలకాలు కష్టదినాలను శాసించిన గ్రహాలు దృష్టిని అట్లా తిప్పనీవా? లేక మనసు ఆ అలవాటులోనించి తప్పుకోలేకపోవడమే కారణమా? మరి కొన్నాళ్లు సాధించాలా ఆ మనోజాడ్యాన్ని! లేక సాధనవల్లనా? నిశ్చయశక్తి మనసుది. ఈ గుణం మనసునించి వొదిలిపోవాలని మనసే నిశ్చయిస్తోంది. కాని ఎందుకు వొదలదూ? గట్టి అలవాటు గనక పోవటంలేదా? ఎప్పుడు తెచ్చుకున్నాను యీ అలవాటుని? ఈ జన్మంలో జ్ఞాపకంలేదు. పూర్వజన్మనించా! లేక యీ నిశ్చయగుణం conscious mind ది, ఆ బలహీనం Sub conscious mind కావటం మూలానా?

నిన్న చండ్రాల సైకిలుమీద వెడుతో యిదే అనుకుంటున్నాను ఎత్తైన కాలవగట్టుకీ బండిబాటకీ మధ్య సైకిల్ చక్రం జారి పడిపోయినాను. పదిశే! నాలుగు వెమికలకు తక్కువ విరిగివుండవు. కాని ఎన్నిసార్లిట్లా తప్పించుకున్నాను. అదృష్టమా నా నేర్పా!

వసంతఋతువు వొస్తున్నానని కబుర్లు పంపే ఇట్లాంటి కాలంలోనే, యిట్లా వరిని కుప్పలుగా వేసినప్పుడే, మండు యెండలోనైనా ఆ కుప్పల కినకాల కాస్తనీడలో వొదిగేవాళ్లం నేనూ — మ్మా. ఆ కొత్త వరిగడ్డే మా సోఫా, అదే మా తలగడ. ఈ చిన్న కాలవగట్టున ఆ చిన్న తుమ్మచెట్టునీడ ఆధారంచాలు మాకు, పగలంతా

గడపడానికి. ఆమెమీద ఒక కన్ను, ఎవరూ సమీపించడంలేదుకదా అని ప్రపంచంమీద ఒకకన్ను. మళ్ళీ ప్రపంచమే మరిచి అంత మనమూ ఆమెమయమై, తెప్పరిలి మళ్ళీ చూడడం. రక్తం పొంగి పొంగి సమస్తాన్ని నా ప్రియురాళ్ళ క్షేమాన్నికూడా ఆలోచించని ఉద్ధృతపు దినాలవి! కాని అన్నిటిలోనించి ఏ రతీదేవి కరుణించి మమ్మల్ని రక్షించి తప్పించి బైటపడవేసింది? ఆ పరిస్థితులలో సంఘము, ఆరోగ్యము, స్వభావము స్త్రీ అబలత్వము పురుషక్రౌర్యము జలసీ వీటిలో ఇతరుల జీవితాల్ని శాశ్వతంగా భగ్నంచేసిన విష యాలు నే నెరుగుదును. ఎందుకు విధి నన్నింత సులభంగా కరుణిం చింది! వదిలింది? నా వివేకమా? ప్రజ్ఞా? సమస్తమూ సులభంగా ప్రేమకై ప్రపంచముందు పదిసార్లు వొడ్డిన మూర్ఖుణ్ణి! ఏది పాలిం చింది? వృత్త chance అవునా? లేక నా పూర్వజన్మ సుకృతమా? పూర్వజన్మలో నే పూజించిన దేవతా? కాని యీ నాటికై నా నా సుస్వభావంచేత నైతేనేం, నా సంకోచ భీరుత్వాలచేత నై తేనేం, నా ప్రమత్తతవల్ల నైతేనేం, నా చేతినించి తప్పిపోయిన సౌందర్యమే నన్ను పలకరించి, వెక్కిరించి యేడిపిస్తుంది! ఎందుకు?

ఇంత సౌందర్యకాంక్ష కలిగిన నేను-అట్లాకాదు ఒక కథ వ్రాయాలనిపిస్తోంది. నావంటి సౌందర్యోన్మత్తు డొకడు తపస్సు చేస్తాడు. వరాన్ని పొందుతాడు; తను కోరిన స్త్రీ ప్రతి ఆవిడా తన్ను మోహించాలని. నావలెనే ప్రతిస్త్రీలో ఏదో వొక విధ మైన అందాన్ని చూస్తాడు. వాంఛిస్తాడు. ప్రతివారూ గోపిక ల్లాగు అతన్ని అనుసరించి వెంటబడతారు. ఏమాతాడతను?

తోవవెంబడిపోతో, ఒక్క కళ్ళలో, ఒక్క నడకలో, ఒక్క మాటలో, చిరునవ్వులో, చేతి వేళ్ళలో, అందాన్ని చూసి ముగ్ధుణ్ణి అవుతాను. ఆ సౌందర్యాన్ని గమనించడం అంతటితో ఆగక, వాంఛ నరాల్ని బాధిస్తుంది. నవ్వు వొస్తుంది. నేను వ్రాయ తలుచుకున్న కథ జ్ఞాపకం వొస్తుంది. Byron పద్య Despair "లోకంలోని అందమైన పెదవులన్నీ ఒక్కచోట గుమికూడరాదా నేను ముద్దుపెట్టుకునేందుకు?" అన్నాడు. అంతేకాదు నేను—

అనాదినించి పుట్టి చచ్చిన సౌందర్యవతులు, కవులు భావిం చిన స్వరూపాలు, పుట్టబొయ్యేవారు, అందరూ వేధిస్తారు. నవ్వు

కాదు. ఇప్పుడు చిన్నగా వున్నవారినిచూసి బాధ కలుగుతుంది. ఇంత నా హృదయంలోని మీరు అనుకునే మాలిన్యాన్నంత ఎందుకు కలుకుతున్నానంటే అది మాలిన్యంకాదు. నాలోకాని, మీలోకాని, అట్లాంటి వాంఛలు మాలిన్యం కాదని నిరూపించడానికి. అట్లాంటి వాంఛలు లేవంటారా— నిజంగా మీలో లేవంటారా— ఎంత జాలికలుగుతుంది! నపుంసకుడికన్న అధములా— నిజంగా అంత అధములా— జీవశక్తే లేదా— పాపం... పుణ్యాత్ములూ, మర్యాదస్తులూ కావడానికి... సృష్టిశక్తుల్ని నాడాలవాడిచేత చితకకొట్టించుకోడంకన్నాకూడా... మనస్సులో శృంగారభాగాల్ని కత్తిరింపించుకున్నారా? ఎందుకు బతుకుతున్నారు? ఎంత ఘోరం!

అందుకనే అంటాను— ఎన్నిమతాలు ఎన్ని సోషలిజములు మానవజాతి సమానత్వాన్ని బోధించినా, సనాతనుల తెలివి వొప్పుకో వలిసివొచ్చినాసరే కాని, మీరే మనుషులైతే నేనుకాను శృంగార భావం, సౌందర్యతృష్ణ మలినమే ఐతే, నేను మలినుణ్ణి పశుత్వమే ఐతే, మన్నించి దూరమై పశువుల్లో కలవడం గౌరవం నాకు. అది నాకు వున్న సౌందర్యతృష్ణ. అనేకమందికి వుంది, జడులకు తప్ప. తీవ్రతలోనే భేదం, అంతే. ఈ తృష్ణ— ప్రతిచోటా సౌందర్యం కనపడే యీ గుణం, యెప్పుడో యీ ఆధారాల్ని వీడి, తనంతట తాను యీ సౌందర్యాన్ని కల్పించుకుని, మనుష్య సంబంధంగా యీ జడప్రపంచ సంబంధంగా కాక, తనలోనే కల్పించుకోగలిగితే, ఆ ఆనందానికి ఆ సౌందర్యారాధనకి ఆ మాధుర్యానికి అంతం వుంటుందా? సముద్రపు అలలలో చూసిన ఆ నునుపు, ఆకాశపు నీలం చిక్కదనం, యీ తామరల పరిమళం, యీ స్త్రీ శరీరాల స్నిగ్ధత్వం మోహమాధుర్యం, అన్నీ యీ హృదయంలో అప్రమేయంగా యిచ్ఛామాత్రంగా జనించి ముంచేస్తే— పోనీ వాటిని కాకపోయినా, ఆ సౌందర్యాల్నే కాకపోయినా, అవి కల్పించే ఆనందమైనా నేనే కల్పించుకోగలిగితే యింకేం కావాలి! ఎందుకంటే యిప్పుడుచూసే అందంకూడా ముప్పాతిక నేనే కల్పించుకుంటున్నాను. అందరికీ కనపడుతుందా సౌందర్యం? రసికులకళ్ళకే గాని! ఎప్పుడో తప్పదు నేను—

ఎట్లాగో......యేమీ తెలీదు వుత్త ఆలోచనలూ కోతలూ తప్పు! ఉత్త ఆశలూ, కలలూ అంతే. స్త్రీ అనే పదంనించి

విముక్తి లేదు. వృత్త భ్రమ, ఏదో ఆత్మ వుందనీ_అది యీ విశ్వ ఆత్మ కల్పించిన సౌందర్యంలో ఐక్యమై విశాలమై యీ సౌందర్య తృష్ణను తృప్తిపరుచుకుంటుందనీ, యీ విఫల మనోరథులు, యీ defeated people, పొందే కలవంటిదే, యిదో పిచ్చి కల! కాని అట్లాంటి పర్యవసానమే లేకపోతే, యీ వాంఛనించి, యీ నాదిగా చేసుకొని, ఎవరిదైనా నేనే మింగెయ్యాలనే యీ శునకత్వంనించి తప్పించుకోకపోతే, యీ జన్మ యెంత నీచం, యీ సంకుచితత్వం యెంత క్షుద్రం? దేవుడు లేడు. కాని ఆ దేవుణ్ణి కల్పించిన మనస్సు దేవుణ్ణి నిరాకరించిన మనస్సు, దైవత్వాన్నందుకోలేకపోతే యెందుకు బ్రతికి? ఎప్పుడూ యీ అల్ప సంతోషంతో సౌందర్యావేశాలతో తృప్తిపడుతో బాధపడుతో యెందుకు కాలం గడపడం?

—0—

ఉదయసూర్యుడు, నేర్పుగల ప్రియుడివలె యీ చెరువు మధ్య తామర మొగ్గల చివర్లని కిరణపు కొనలతో తాకి, యెర్ర బారేట్టు పులకరింప చేస్తున్నాడు. నేనూ సౌరిస్, తన్మయులమై ప్రతిదినమూ ప్రపంచం కళ్ళముందు జరిగే యీ ఇంద్రజాలాన్ని కొత్తగా చూస్తున్నాము గట్టున నుంచుని.

"Good morning sir"

తిరిగి ఓ కుర్రాణ్ణి కనుగొన్నాను నా బుజంకింద. సంభాషణలో చాలాభాగం నేను తెలుగులోనూ, అతను యింగ్లీషులోనూ నడిపించాము. సౌరిస్ నించి ఆపుకోలేని నవ్వుకూడా అతని యింగ్లీషులో తప్పుల్నిగాని, అతని మాటల్లోని "seriousness" ని కాని కదిలించలేకపోయింది. టీచర్ని కావడంచేత ఏ భాషలో యేలోపాలూ నన్ను నవ్వించగలిగే శక్తిని పోగొట్టుకున్నాయి. నాలో "Sense of humour" బతికివుంటే నా అధికార్ల మొహాలమీద నవ్వి వుందును! ఒక "Sense of misery" మిగిలింది. కాని యింకా నాలుగు నెలలు యీ దరిద్రపు పాఠశాలలు తనిఖీలు చేస్తే, డాక్టర్ల హృదయంవలె "self preservation" కోసమన్నా ఆ "misery" చావక యేం చేస్తుంది? చివరికి యిదంతా మామూలనో, మనకేం పట్టింది, యీ లోకాన్ని మనమా ఏర్పరిచింది అనో లేకపోతే యిదంతా మాయ, అనే ఆలోచన దుప్పట్లనో కప్పుకొంటుంది పాపం మానవ హృదయం; యింకా పూర్తిగా యెండిపోని వెర్రి హృదయం.

"బ్రహ్మసమాజం రూల్సు ఏమిటండి?"

"నాకు బ్రహ్మసమాజంసంగతి ఏమీ తెలీదు" అన్నాను.

అబద్ధం.

కాని ఆ వృసియాన నా చెవికింద "discussion" నా ఆనందాన్ని భంగ పరుస్తుందనే శెంగ. అబద్ధంతో అవన్నీ వొదుల్చుకోవాలని ప్రయత్నించాను అబద్ధంవల్ల ఏదీ వొదలదని తెలిసికూడా. కాని వచ్చినవాడు ఫల్గుణుడు.

కొన్ని బ్రహ్మసమాజపు పుస్తకాల పేర్లుచెప్పి పెద్దాడ రామ స్వామిగారి దగ్గిరికి వెళ్ళమన్నదాకా నన్ను వొదల్లేదు. అప్పటికీ వొదల్లేదు. నాకు అర్థమౌతోంది, అతనికి బ్రహ్మసమాజం సంగతి యేమీ అక్కర్లేదనీ, నాతో మాట్లాడేందుకు అదొక వంక అని. బ్రహ్మసమాజమనగానే ముందు కాబోయే బ్రాహ్మగోధుడు దొరికాడనే భ్రమలో నేను కావిలించుకుంటానని అతని వుద్దేశ్యం.

"Tell me ఈ ఆనందం యేమిటి?" అన్నాడు.

ప్రతిప్రశ్నా అతను "Tell me" తో ప్రారంభించాడు. సారిక్ అతనికి 'Tell me అని పేరుపెట్టింది Longfellow, "Tell me not" అనడంచేత నేనతనికి Shortfellow అని పేరు పెట్టాను.

"ఏం ఆనందం?" అన్నాను అర్థంగాక.

"అదే! మీకీ ఆనందమంతా......Tell me"

తెల్లబోయి చూస్తున్నాను.

"Tell me నిన్నట్నించి చూస్తున్నాను. మీరు ఆనందంగా గడుపుతున్నారు"

ఏం చెప్పను?

"ఇక్కడ నీకు మాత్రం ఆనందంగా లేదా?"

చుట్టూ చూసాను. నిండి పొర్లుతున్న చెరువు, హంసలవంటి తెల్ల తామర పువ్వులూ, వాటిమీదనించి వొస్తున్న పరిమళంతో చిక్కనైన గాలీ, చుట్టూ ఆ చిన్న కుటీరాలూ పొలాలూ-ఆకాశం-అన్నీ.

"అదంతా సరే లెండి. అసలు మీరు ఆనందంగా కనపడుతున్నారు. Tell me"

అతని "earnestness" చూసి నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆనందమా! నాకా? ఏ నిమిషానైనా నేననుభవించేది ఆనందమో బాధో, నాకు తెలుసా? నాకు తెలిసినా అతనికిచెప్పగలనా? నేను చెప్పినా అతనికి అర్థమౌతుందా? అర్థమయితేమాత్రం ఉపయోగపడుతుందా? రాత్రులకు రాత్రులు ఇంక ప్రపంచానికి తెల్లవారడమంటో వుందా? అని నరాల బాధతో, విరహబాధతో యీజన్మబాధతో యీప్రపంచానికి అర్థంయేమిటో తెలీదనేబాధతో,

నరాలలోపలి చెప్పలేని బాధతో, అర్థంలేని కారణంలేని గొప్ప బాధతో, చీకట్లో చీకట్లు కల్పించుకుంటో యేడ్చిన రాత్రులసంగతి అతని కెట్లా తెలియచెయ్యగలను? ఇంకా ఆ బాధ పోలేదనీ, ఎన్నటికీ పోయేట్లులేదనీ ఎట్లా చెప్పను?

జీవితమంతా పెద్ద ప్రశ్నార్థకంగా ఎక్కడన్నా స్థిరమైనది అనే ఆధారం వున్నదా అని వెతుకుతో హృదయాన్ని రోడ్డుమీద పారేసేవాడు, అన్ని సౌందర్యాలూ, ఏలేశమైనా ఏమూలనున్నదో తప్పించుకుంటోందనే thought తో కుంగిపొయ్యేవాడు లోకంలో ఏమూల బాధవున్నా, తను ఆనందపడలేనివాడు ఆనందంగా కనపడుతున్నాడా?

ఆనందం అంటే ఏమిటి? చి___ జ్ఞాపకం వొచ్చినప్పుడల్లా హృదయం ఆగడం బాధా మాధుర్యమా? ఆవుదయాన చల్లనిగాలి తాకినప్పుడు నేను అనుభవిస్తున్నది ఆనందమా! బాధా! దేహం హాయి అంటుంది. మనసు ఏదో తెలీని ఆరాటంతో గుంజుకుంటుంది తాను అందుకోలేని దేనికోసమో! తాను వొదిలి సగం జ్ఞాపకపడే దేనికోసమో! ఈనాడు యే ఆనందంగానూ కనపడని ఘడియలు వారంరోజుల తరవాత వెనక్కి చూసుకుంటే చాలా అందంగా కనపడతాయి. ఈ మార్పు అంతా కాలంలోనూ, అనుభవాన్నిస్తున్న పదార్థాల్లోనూ వుందా! లేక మనసు కల్పిస్తున్న విచిత్రమా? లేక లోపలి యీ మననూ బైట యీ ప్రపంచమూ కలిసి చేస్తున్న మోసమా? లేక యీ మననూ ప్రపంచమూ, అంతా ఒకటేనా? సౌందర్యం కలిగించే హృదయ చలనం ఎంతవరకు పూర్వసౌందర్యానుభవాల జ్ఞాపకంవల్ల? 'పూర్వం' అంటే యీ జన్మలోనేనా, లేక ఇంకా వెనకా?

ఈనాడు ధనం దాచుకునే, గొప్పగా అనుభవించే భాగ్యవంతులమీద తమ హక్కుల్ని దోచుకున్నారని ఆగ్రహిస్తున్నారు గాని, పరిశీలిస్తే, intrinsic values దగ్గరికి వెళ్ళిచూస్తే, వీళ్ళకీ ఉత్త ఈర్ష్య తప్ప, తమకు లేనిది ఇంకొకరికి వుండి పోయిందనే ఆగ్రహం తప్ప యీ సుఖదుఃఖాలలో మనిషికీ మనిషికీ అట్టే తేడాలేదనే విశాల దృష్టి లేదేమో! జీవితమంతా అలవాట్ల పుట్ట. ఆ అలవాటే ఎంత బాధలో, దరిద్రంలో వుండే చురుకుదనానికీ నల్లమందు పూత

పూస్తుంది. ఆ అలవాటే ఎంత ఐశ్వర్యంలో వుండే ఆనందాన్నీ మామూలుచేసి ఆత్మని తీరని కోర్కెలతో క్షోభ పెడుతుంది. మహారాజు భోజనపదార్థాలకీ, దరిద్రుడి భోజనపదార్థాలకీ లక్ష భేదం వుండవొచ్చు. కాని వాటి ఆరోగ్యపు విలువగాని ఆనందపు విలువగాని సమానమే కావొచ్చు. లేకపోవడంలో లేదు బాధ, లేదని యాడపడంలో వుంది బాధ అంతా. అవసరంగా కావలసిన వాటికి ఏడవకుండా వుండడం చాలా కష్టం. కాని సుప్పాతిక ప్రపంచంలో దుఖ్ఖం అవసరం లేనివాటికి యాడవడంవల్లనే కలుగుతోంది. ఈ పై భేషజాలని తొలగిస్తే, అన్ని దేహాలు వొకటే ఐనట్టు, పై మెరుగులు తీసేస్తే మనసులన్నీ వొకటేనేమో! మన స్వంత మనసులే దుఖ్ఖిస్తున్నాయో, సుఖిస్తున్నాయో కనుక్కోలేమే, ఇతరుల సంగతి మనకేం తెలుసు? మేడలుచూసి, సుఖమని, గుడిశలు చూసి, దుఖ్ఖమని మన మనసు విభజించుకుంటుంది. అంతే!

నిన్న —య్యా వొచ్చాడు. యెనిమిదేళ్ళ తరవాత! తన టీచరు సర్టిఫికెటు పూర్తిచెయ్యడానికి తాను లంచాలు మొదలైన వాటికోసం మూడు నెలల జీతం ఖర్చుపెట్టిన సంగతి చెపుతున్నాడు. అతని ఆకారాన్ని చూసి అందరూ నవ్వుతున్నారు. కాని అంద వికారం అతనికి మామూలయింది. అతని భార్యకీ అయింది. వాళ్లిద్దర్లో ఎవరికీ విచారంలేదు ఆవిచారమంతా చూసే మనసుల్లోనే.

పట్టుకున్నారు. లంచాలు తీసుకున్న అధికారిని శిక్షించడానికి —య్యాని వాఙ్మూలమిమ్మన్నారు. ఇవ్వనన్నాడు.

"ఎందుకు యివ్వలేదు? ఇట్లా బీదల్ని దోచుకునే అధికార్ల నాశనం కావాలి" అన్నాను, లోకసంస్కరణ ప్రయత్న వాసనలు చావని నేను.

—య్యా ఒక్కనిమిషం ఆగాడు.

ఒకనాడు వర్షంలో తడుస్తూ పోయినాను వాళ్ళయింటికి. భార్య చిన్నది. అమాయకురాలు. "నన్ను అప్పులపాలు చేసిన అధికారిమీద కోపం కలిగినప్పుడల్లా, ఆమె ముఖం నాయెదట నిలబడుతుంది" అన్నాడు, ఎందరు హర్షిస్తారు —య్యా హృదయ మార్దవాన్ని! అంద వికారుల్లో అందవికారుడు, దరిద్రులలో దరిద్రుడు,

ఏ తెలివీ, ఆశయాలూ లేని పూర్వాచారపరాయణుడు, మూర్ఖుడు బడిపంతులు — య్యా

ఇంకా యిటూ, అటూ, అని నేను సంశయిస్తున్న రోజుల్లో, ఓ నాటి అర్ధరాత్రి. గాంధీగారు కలలో కనపడ్డారని, లేచి తువ్వాల దులిపి, శిబిరంలో చేరి, సాయింత్రానికి తల పగిలి మర్నాడు జైల్లో పడ్డ — య్యా ధీరత్వం ఎందరు గుర్తించారు? ముందు గతిని, తెలుచుకోక పూటకి తిండిలేని సంసారాన్ని వొదిలి, 'call' వొచ్చిందని పరిగెత్తిన — య్యా ఆత్మలో వుండే బలాన్ని! నన్ను చూడగానే, నా పాదాలమీద చేతులేసి కళ్ళ నద్దుకున్నాడు ఏ నాడో ఎనిమిదేళ్ళకిందట కష్టదశలో సహాయం చేశాట తనకి. నేను మరచిపోయినా ఆ కృతజ్ఞతాభారం ఆ హృదయాన్ని వేధిస్తోనేవుంది గావును!

నాకన్నా చాలా గొప్పవాడివని చెప్ప గలిగిన ధైర్యం నాకు లేదు. ఎందుకు వొచ్చాడా? ఏ రికమెండేషన్కా? అప్పు అడగడానికా అనే పనిచేస్తోంది నా మెదడు. ఎంత అసహ్యించుకున్నా, ఎంత వేదనపడి ప్రయత్నించినా యీ భీరుత్వాలు, యీ అధికార బిడియాలు, హృదయాన్నించి వేరుపరిచే యీ అనుమానాలు వొదలవు గావును మానవుణ్ని! ఈ దుర్గుణాలతో పోట్లాడి లాభం లేదు. ఒక్కొక్కటే వేగంగా విడతీసి తీసివెయ్యలేము. ఒక దాన్ని నరికితే, దానికి సంబంధించినవి పది పక్కనే మొలుస్తాయి. ఈ మానవ అసహాయత్వాన్ని క్రిస్టియన్లు 'Original sin' అని తత్వనిరూపణ చేసి, యీశ్వర కటాక్షం వొక్కటే మానవుడికి దుష్టత్వంనించి విముక్తి నియ్యగలదన్నారు.

అసలు ఇది సుగుణమనీ, ఇది దుర్గుణమనీ దేన్ని నిర్ధారణగా చెప్పగలం? ఒక పరిస్థితిలో, ఒక సమయంలో, ఒక కోణంనించి, ఒక్కొకరిలో దేశకాలపాత్రల ననుసరించి యీ గుణాల గుణం మారుతో వుంటుంది. మనిషిని చంపలేను. చంపి ధైర్యంతో పశ్చాత్తాప పడకండా భయపడకండా బతకలేను. ఇది సుగుణమా? భీరుత్వమా? ఒక కోణంనించి పురాణాలవాళ్ళు పాతివ్రత్యాన్ని సుగుణం చేశారు. ఇంకో కోణంనించి నేను ఆ పాతివ్రత్యాన్నే అతి నీచత్వంగా ప్రదర్శిస్తున్నాను. కనకనే యీ గుణాలన్నిటినీ కలిపి, ఏగుణమూ లేని ఏగుణాలకీ అతీతమైన ఏకత్వం సంపా

యించాలన్నారు వేదాంతులు. వీటినన్నిటినీ ద్వంద్వా లనేసి, యీ విరుద్ధాలూ విరోధాలూ యీశ్వరుడిలో సమన్వయ మౌతాయన్నారు. ఆ సమన్వయం యీ సామాన్య ప్రపంచపు plane లో అర్థమయ్యేట్టు లేదు. ఉన్నతమైన వాతావరణం అందుకుని ఆక్రమించి చూస్తే ఆ అనుభవంలో యీ భేదాలూ, యీ స్వల్పత్వాలూ వాటంతట అవే మాయమౌతాయేమో! చిరతపులి మచ్చలు ఒక్కొక్కటే ఏరి రుద్దితే పోతాయా? చర్మమే వొదుల్చుకోవాలి గాని చాతనైతే!

"నీకు ఆనందమైన పనులేవో చెయ్యి. ఇతరుల్ని అడిగి ఏం ప్రయోజనం?" అన్నాను నా తాత్కాలిక చెరువుగట్టు శిష్యుడు tell me తో.

అతనికి కోపం వచ్చింది. నేనేదో రహస్యాల్ని దాచుకుంటున్నా ననుకుంటున్నాడు.

"నాకు మిమ్మల్ని ప్రశ్నలు వెయ్యడమే ఇప్పుడానందం" అన్నాడు.

"నాకు మాట్లాడక పోవడమే ఆనందం" అనబోయి నేను అతని వెర్రితనంచూసి "కానీ, భరిస్తాను" అన్నాను, కళ్లతో.

నా భోజనం, నా ప్రవర్తన, నా బట్టలు, అన్నిటికీ అర్థాలు విచిత్రాలు ప్రశ్నించాడు. జవాబు చెప్పాను. కాని అతనికి తృప్తి నిచ్చేది ఏమీ చెప్పలేక పోయినాను.

అతను వెళ్లేప్పుడుమాత్రం దిగులు వేసింది. ఏమిటో అతని బాధ? అతనికే తెలీదు. ఏదో తెలుసుకోవాలని ఉంది, నానించి అతనికి. అతని అవసరాన్ని గుర్తించి , సహాయం చెయ్యగల ఔన్నత్యం నాకు లేకపోయింది.

—o—

మధ్యాహ్నం Musings రాద్దామా, మల్లెపూలు గుచ్చు దామా అనే సమస్య పది నిమిషాలు మనసుకి పని పెట్టింది. ఇట్లాంటి చిన్న వ్యవహారాల్లో కూడా యింతసేపు ఆలోచించడం మామూలు క్విక్ డెసిషన్ చేతకాదు. ఇది ఒక డిఫెక్టు అనీ, దాన్ని మాను కోవాలనీ ప్రయత్నం చేశాను. చాతకాలేదు. జాతకం వాళ్ళూ, పామిస్టులూ మళ్ళీ అదే అన్నారు, క్విక్ డెసిషన్ చాతకాదని ఇవన్నీ నా సంగతులు ఎందుకు రాస్తానంటే, ఇవేమీ గొప్పవని కాదు. లోకానికి వీటిల్లో ఇంటరెస్టు వుంటుందనికాదు. నేను కాఫీ తాగినా, తాగకపోయినా; నాకు పందలమీద యిష్టమున్నా, లేక పోయినా, లోకానికి పట్టిందనికాదు ఇలాంటి యోచనలూ వీటి నుంచి తేలే ఫిలాసఫీ దానికి సర్వసాధారణమైన ఎప్లికేషన్ వుంటుందని.

నా నిర్ణయాలుగానీ, నా ప్రయాణాలుగానీ, నా ఆలోచ నలుగానీ నాకు పాఠాలు నేర్పినట్టే, యితరులకకూడా పాఠాలు నేర్పకపోతే సుఖంగా నిద్రపోయే మనుష్యుల్ని కదల్చలేకపోతే, కాయితమూ అచ్చూ వృథా శ్రమ. "ప్రజలు మూర్ఖులు నా ఆర్టు వాళ్ళకి అర్థంకాదు" అనే గొప్పతనానికి రావడం ఇంకా నా చేత కాలేదు. ప్రజలు మూర్ఖులైతే, వాళ్ళకి అర్థంకాకుండా రాసిన నేనూ మూర్ఖుణ్ణే.

డెసిషన్ ఆలస్యం కావడమనేది ఒక లోపమే. నిజమే. కాని దాన్ని తరిచిచూస్తే ఏదో వాంఛనీయమైన గుణంతో లంకెను కలిగి వుంటుంది. ఏ ఇమేజినేషన్‌తోనో క్విక్ డెసిషన్ తెచ్చుకోడా నికి ప్రయత్నించి సఫలులమైనామా, ఆ ఇమేజినేషన్ని చంపిన వాళ్ళం కావొచ్చు. ఇది బిడ్డల శిక్షణలో చాలా ముఖ్యమైన వాంశం.

అట్లానే అనేకమందిలో మనంచూసే లోపాలు చాలా మంచి గుణాలతో సంబంధం కలిగి వాటి భాగాలై వుంటాయి. మంచి

గుణానికితోడు నీడగా, కాంప్లిమెంటరీగా ఒక దుర్గుణం వుండనే వుంటుంది. దయకి అపాత్రదానం; సత్యానికి క్రూరత్వం; ధర్మానికీ మూర్ఖత్వం. అందువల్లనే సకలగుణ సంపన్నుడు అంటారే ఆ వింతమృగం సృష్టిలో వుండడానికి వీల్లేదు. శరభ గండభేరుండాలతో ఏ లోకాల్లో వున్నాడో ఆ గుణాభిరాముడు. ఈ పతివ్రతల్ని, పురాణపురుషుల్ని యిట్లా పరిపూర్ణుల్ని చెయ్యడానికి ప్రయత్నించడంవల్లనే నావంటి వాళ్ళకి వాళ్ళని కారికేచర్ చెయ్యడం యింత సులభమయింది.

పూర్వపు క్రిస్టియనుల సాంకులూ, యీ నాటి బ్రహ్మసమాజమువారూ తమ దుర్గుణాలతో యుద్ధం చెయ్యాలని చూశారు. ఏదుర్గుణమూ నాశనం కాదు. గుణరూపం మట్టుకు మారుతుంది. పైపెచ్చు కొన్ని సుగుణాల్ని చంపి తీరుతుంది. దుర్గుణాన్ని హాని చెయ్యకుండా మళ్ళించడానికి ప్రయత్నం చెయ్యాలి. అందువల్లనే యీ దుర్గుణాల్ని పోషించుకోవాలంటే, తపస్సుద్వారా, అసలు గుణాలకే అతీతమైన స్టేజ్ అందుకోవాలని చూసినట్టున్నారు హిందూదేశంలో. గుణాల్ని వెతికి నాశ్యాలనుకోవడం గొంగట్లో మెతుకు ఏరినట్టే యెందుకంటే మనస్సుయొక్క యేర్పాటులోనే, లిమిటేషన్‌లోనే, క్వాలిటీలోనే వుంది గుణ విభజన.

మన నిట్లా చాలాకాలంనించీ బాధిస్తున్న గుణాలసంగతీ మనకు పూర్తిగా తెలీనివాటిసంగతీ, సులభంగా జ్యోతిష్కులు యే జాతకచక్రమో, అరిచేతిగీతలో, చూసి మనకి చెప్పేస్తే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. అదేమిటి? దస్తూరినించి ముఖాలనుంచి స్వభావం విప్పి చెప్పగల వాళ్లున్నారు. ఇదంతా చూస్తే దీనికంతా మనిషిలో ప్రతి అంగానికీ, ముఖంలో మడతలకీ, చేతిలో గీతలకీ, అరికాలు వొంపుకీ, కంటి రంగుకీ, పుట్టిన సమయానికీ, వంశానికీ, పరిస్థితులకీ, వ్రాసే అక్షరాలకీ, పలికే మాటలకీ, ఆలోచించే యోచనలకీ, గ్రహస్థితులకీ, కర్మకీ, అన్నిటినీ కలిపి అర్థమిచ్చే ఒక్కటే ఏకసూత్రం వుండిగావును! అందువల్లనే వీటిలో ఏ వొక్కటీ తెలిసినా తక్కినవన్నీ తెలిసిపోతాయి, ఆ శాస్త్రం తెలిసినవాళ్ళకి.

మల్లెపూలు గుచ్చడం చాలా సరదా. మధ్యాహ్నం వరండాలో గోడ్డుకేసి చూస్తూ కూచుని, తీరిగ్గా ఏవేవో ఆలోచించు

కుంటూ, మధ్యమధ్య సౌరిస్‌తో ఆలోచనలు ఎక్స్ఛేంజి చేసుకొంటో, విశ్రమించడం చాలా సరదా. కాని musings (వ్రాయడం డ్యూటీ కదా అనుకున్నాను. ఏమిటా డ్యూటీ అనిపించింది ఉన్నతమైన పని, లాభకరమైనపని, అర్ట్ యిట్లా ఆలోచించాను. ఏమిటా ఉన్నతం? ఏమిటా లాభం? ఏమిటా అర్ట్? అని తరిస్తే ఏమీ కనపళ్లేదు. అదే తమాషా. వూరికే పని అన్ఇంపార్టెన్సుని ఘనతగా కల్పించుకుని సమర్థించుకోడానికి మనసు కల్పించుకుంటూంది, యీ మాయల్ని- తానేదో చాలా గొప్పపనుల్ని చేస్తున్నానని, ఎదో చదివేవాళ్ళకి ఆనందాన్ని కల్గిస్తున్నాము, జ్ఞానాన్నిస్తున్నాము అనుకోడం ఇదంతా వృత్త వానిటీ ఏమో విచారాన్నే కలిగిస్తున్నామో లేక తప్పుడు జ్ఞానాన్నిస్తున్నామో, కుటుంబ కలహాల్ని కలిగిస్తున్నామో, లేక విడిపోవలసినవాళ్లని కలుపుతున్నామో! అయినా యిదంతా పరోపకారార్థం అనుకోడం సెల్ఫ్‌డిసెప్షన్ self deception. అంతా మన ఆనందానికే. దేనికైనా చివర నిజం_ నేను, నా ఆనందం_ అనేది తప్ప వేరులేదు. ఇతరులకి ఉపకారంచేస్తే ఆ వుపకారం చెయ్యడం నాకేమి వుపకారం చేసిందనేదే అంత్య ప్రశ్న. 'నేను' అనేదితప్ప వేరే కొలత, వేరే ఆధారం యెక్కడా దొరకదు, ఎవరికీకూడా.

ఫాల్గుణమాసపు మధ్యాహ్నం వేడిగా వున్నానా, చల్లగా వున్నానా అని సందేహించే సోమరిగాలి, విచ్చని మల్లెపూల పసి తెల్లదనం, వాటిలో దాక్కుని నిద్రబోతూవున్న పరిమళాన్ని సూచించే పచ్చివాసన, గిన్నెలో నీళ్ళ చల్లదనం_ అన్నీకలసి యేదో శాంతత్వాన్ని యిస్తున్నాయి మనసుకి, నాకుకూడా_ చాలా ఆరాటాలకి అలవాటైన నాకుకూడా. నాకే యిట్లావుంటే, యీ యెండాకాలపు నెలలు మధ్యాహ్నాలప్పుడు తీరకగా మల్లెపాదలనుంచి పూలుకోసి, మాటలు చెప్పుకుంటో, వాటిని సోమరిగా దండలుకట్టి, తలలో పెట్టుకునే యువతులకి ఎంత సంతుష్టి నిస్తాయో, యీ పువ్వులు! ఏ ప్రశ్నలూ లేకుండానే అకాన్షస్‌గా, యీ మల్లెపూవుల్ని తాకితే వేళ్ళ కొసల్లోంచి పైకి నెమ్మదిగా పాకే ఆనందాన్ని తీసుకుంటారు వాళ్లు.

మల్లెపూలకేక వినగానే 'చే' గంతులేస్తుంది. ఆడపిల్లలు 'మల్లెపూలో' అనే కేక వినబడగానే 'మల్లెపూలే అమ్మా' అని గోల పెడతారు మల్లెపూలనుంచి నేను పొందే యీ సుకుమారమైన సౌఖ్యం వాళ్ళనీ ప్రోత్సహిస్తుందా? లేక మల్లెపూలు పెట్టుకున్నామనే సాంఘిక గౌరవం కోసం ఆరాటమా?

ఎవరో గుచ్చి యిచ్చినవీ, అమ్మినవీ దండలు తలలో పెట్టుకుంటే యీ శాంతి యీ మాధుర్యం కలుగుతుందా? ఇల్లా చేతితో తాకి విశ్రాంతిగా గుచ్చిన అనుభవం! —శుక్రుడికాంతివలె తెలీకుండా రక్తంమధ్య యెక్కడో చలించే శృంగారం! జాతికాకే సంగీతంవలె నరాలమధ్య చక్కలిగిలిపెట్టే చిరునవ్వు!!

మార్దవమైన అమాయకమైన సౌఖ్యాలు క్రమంగా తొలిగి పోతున్నాయి జీవితాల్లోంచి. నాగరికతవల్ల నరాల్ని కొట్టి, గుంజి, తీవ్రంగా కంపింప జేస్తేనేగాని చలనం కలగటంలేదు హృదయాలకి. సినిమారంగులు, రేడియో అరుపులు, అత్తరు ఘాటులు, కాఫీహోటలు ఖసువురుములు, పట్టణపుస్త్రీలు మల్లెపూలు గుచ్చుకోరు. విద్యావంతులు మాటలు, కబుర్లు, తగాదాలు, క్లబ్బులు వీటితో గడుపుతారు. సాయంత్రాలు తల్లో మల్లెపూలు విచ్చినప్పుడు ఆ వాసనని అంగీకరించేందుకు వ్యవధిలేదు, కుర్చీలమీద కూచుని 'బ్రిడ్జి' ఆడే స్త్రీలకి. మల్లెపూలు గుచ్చడంమాని, సిల్కుచీరెలూ, భర్తల గొప్పదనాలూ, పిల్లల విద్యా, అధికారంగల స్నేహితుల షోకులూ, వియ్యంకుల విరాళాలూ— ఇవీ వీళ్లు చేస్తున్న పనులు. స్వతంత్రాన్వేషణంలో విద్యా వ్యామోహంలో శాంతికీ, సుఖానికీ దూరమైవారు. పోనీ, ఆ స్వాతంత్ర్యమేమీ రాలేదుకదా, ఒకవిధమైన బానిసత్వంనుంచి యింకో విధమైన బానిసత్వానికి ప్రయాణమైనారు. వడ్డాణాలు, కాసులుపేర్లూ మాని సన్నగొలుసులకీ, రవ్వల గాజులకీ దాసులైనట్లు. ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినా సెక్సు స్వాతంత్ర్యం రాలేదు. భర్తకోసం వెతకడం, భర్త దొరికింతరవాత తగాదాలు ఈర్ష్యలు, దాచుకోడాలు; నటనలూ. భర్తదొరక్కపోతే రహస్య ప్రియులు- ఇవీ నవీనస్త్రీల చరిత్రలు.

మల్లెపూలతో నాకీ ఆత్మసంబంధం బాల్యంనించి వుంది. మా మల్లె పొదని సాయింత్రం వెతికి మొగ్గలెన్నికోసినా యెట్లాగో పోవు!

కొన్నిటిని ఆకుల్లో కనబడకుండా దాచుకునేది. తెల్లారే లేచివొచ్చి ఆకుపచ్చ సొంపుమీద తెల్లగా విచ్చిన పూలని చూసి నక్షత్రాలు కొన్ని రాత్రి భూమికి రాలాయా అన్నట్టు వెర్రిగా చూసేవాణ్ణి మొన్న పెద్ద గిరివాడలో చింతచెట్టుమీద కూచున్న తెల్లకొంగల గుంపుని చూస్తే చిన్నప్పటి నా మల్లెపొదే జ్ఞాపకం వొచ్చింది. దగ్గరకెడితే ఆ పూలు ఎగిరిపోవా అనిపించేది. దరిద్రపువనిలో యెల్లాగో గడిచిన సంవత్సర చక్రం తిరిగి ఫాల్గుణమాసంలో మొదటి మల్లెపూల పరిమళం తగిలేటప్పటికి యింకా సౌందర్యం లోకంలో నశించలేదనీ, యెంత తొక్కి ధ్వంసం చేసినా, యీ పిచ్చిహృదయానికీ, యీ కవిప్రపంచానికీ, యీశృంగార సంబంధం వదలదనీ మళ్ళీ రూఢి కలుగుతుంది.

మల్లెపూలు, తెల్లని మల్లెపూలు, విచ్చిన మల్లెపూలు! ఆ పరిమళం నాకిచ్చే సందేశం యేమాటలతో తెలపగలను! సాయంత్రాలు స్నేహానికి చల్లని శాంతినిచ్చే మల్లెపూలు; అర్ధరాత్రులు విచ్చి జుట్టు పరిమళంతో కలిపి నిద్రలేపి, రక్తాన్ని చిందులుతొక్కించే మల్లెపూలు; వొళ్ళమధ్య, చేతులమధ్య నలిగి నశించిన పిచ్చిమల్లెపూలు; రోషాలూ నవ్వులూ, తీవ్రమైన కోర్కెలతో తపించి వాడిపోయిన పెద్ద మల్లెపూవులు; సన్నని వెన్నెట్లో ప్రియురాలి పంటికన్న తెల్లగా — పిచ్చి! యేమిచెయ్యాలో తెలీని ఆనందంతో గుండె పట్టి చీలికలు చేసే మల్లెపూలు; తెల్లారకట్ట లేచి చూసినా యింకా కొత్త పరిమళాలతో, రాత్రి జ్ఞాపకాలతో, ప్రశ్నించే మల్లెపూలు; ఒక్క స్వర్గంలో తప్ప ఇలాంటి వెలుగు తెలుపు లేదేమో అనిపించే మల్లెపూలు; అలిసి నిద్రించే రసికత్వానికి జీవనమిచ్చే ఉదయపుపూలు; రాత్రి సుందర స్వప్నానికి సాక్షులుగా అవి మాత్రమే మిగిలిన నా ఆప్తులు మల్లెపూలు

ఎండాకాలపు దక్షిణగాలి, తెల్లారకట్ట అలసటనిద్ర, కోకిల అరుపు, లేవవొద్దనే ప్రియురాలి గట్టి కౌగిలి, మల్లెపూల పరిమళం— అన్నీ ఒకటిగా కలిసి జ్ఞాపకం వొస్తాయి — లోకం సారవిహీనమని అధైర్యపడినపుడల్లా.

అందమైన వుదయం, పెద్దచెట్లు ఆకాశం కనబడకండా రోడ్డుపక్కనించి నెత్తిమీద కలుసుకోడంచేత వాటి ఆకుల్లోంచి

లోపలికివచ్చే కాంతి రకరకాల రంగులతో కళ్ళకి శాంతినిస్తోంది. పాటలు పాడాలి. వీరకార్యాలు చెయ్యాలి. "సర్వేలోకాః (శేషాచారికూడా) సుఖినోభవంతు" అనాలనిపించె ఉదయం. నేనూ, 'ఓల్డుహార్సు' మాత్రమే కనుచూపుమేర, సర్ గాలహెడ్ ననీ, డాన్క్విక్ సాట్ ననీ ఇమేజిన్ చేసుకొంటూ పోతున్నాను; నా సైకిల్నీ, నన్నూ యెగరగొట్టాలని నా చుట్టూ నవ్వుతున్న గాలిలో- నిరంతర తాలూకా ప్రయాణ నిపుణ్ణయ్యాను.

ఏడుపు...గుంపు...ఓల్డు హార్సు సకిలించి వేగం తగ్గించింది. నాకంటె పూర్వమే, అందమైన మనిషి తన కంటబడ్డదా, నేను కళ్లెం లాగకపూర్వమే మందగించడం అలవాటయింది నా ఓల్డు హార్సుకి.

మొన్న ఒక స్కూలుకో విజిట్ కి వెళ్ళినప్పుడు టీచరు లేడు. అంటే అతనికి వొక్క యీడాది జీవనాధారం అపాయంలో పడ్డదన్నమాట విన్నక్కాని నేను ఓల్డుహార్సు యెక్కాను, వచ్చినపాలం మోడులమీదనించి స్వారీ చేయాటానికి; ఓల్డుహార్సు సకిలించి కదలేదు. ఎందుకు బెదిరిందా అని దిగి నాలుగు దిక్కులా చూశాను. బడి పక్కన ముందు పంచెరి గుంజమీద చేతినానించి టీచరుభార్య - సౌందర్యవతి నుంచునివుంది. దిగాలుపడి చూస్తో, ధేనువుని లాక్కుపోతో వుంటే చూసే జమదగ్ని భార్యవలె.

కళ్ళల్లో నీళ్ళా! వెళ్ళి పలకరించనా? నేను- 'ఫలం' కాదు, కథకుణ్ణి కాదు, మనిషిని కాదు, శృంగారలేశానికై తహతహలాడే రసికుణ్ణి కాదు. స్త్రీ అశ్రువుల్ని భరించలేని సహృదయుణ్ణి కాదు. రాతిని ప్రభుత్వ శాసనను, స్కూళ్ళ తనిఖీదారుణ్ణి, ఉపాధ్యాయ వర్గప్రాణ మూషికలకి మార్జాలాన్ని.

రామతిలకంకన్న యీమె అందంగావుంది. కాని 'పోవుచున్నాడే' అనే పాట వినపడ్డది నాకు. లాభం లేదు. ఈ ఇనస్పెక్టరు యముడు వరాలివ్వడు. ఇచ్చే మహిమా లేదు. "పోవుచున్నాడే— నా విభుని జీతమును గొని, పోవుచున్నాడే......"

పక్కన పరిగెత్తే వంశపాలాల ఆకుపచ్చ పట్టుచునుపునీ కంటి నీళ్ళలో - ఇద్దరం కిటికీ దగ్గర - ఇదంతా వేశ్యా జాణతనమా, ... వాస్తవమా, జీవితం హృదయాన్ని పలిపి పిండుతోందా అశ్రువుల్ని లేక

ఎందుకు, నాముందు ఎందుకు, అనే నా సందేహాలకి - నా మిత్రులందరికీ అమృతాన్ని రుచిచూపిన నీ పెదవిలో వొణుకు - ఏయే అధముల గూఢప్రదేశాలకి విలువ నిచ్చిన నీ వేళ్ళతొందర___

రామతిలకం ___ మనమధ్య తెనాలి రైలుస్టేషను మిత్రుల స్వాగతాలు-

ఏమైనావు? నీ ఊర్ధ్వ జ్ఞాపకాలలో నీవెక్కడన్నా, ఎప్పుడన్నా -- వేశ్యకి హృదయమేమిటి, సూనృతమేమిటని నమ్మలేక పోయిన, నా దుర్మృతనం - నిన్ను అడిగితే, కదిలిస్తే, నా హృదయానికిస్వేచ్ఛనిస్తే ... ఎక్కడ మునుగుతానో అనే నీచపుభయం ...

క్షమించావా, ఆలోకంనించి కాని! 'చిత్రాంగి' వ్రాసిన 'చలం' కూడా...

అనుకుంటున్నావా, ఇంకా!

ఆ ఉదయం మొగవాళ్ళ గుంపుమధ్య, ఆకుపచ్చ చీర, ఆకుపచ్చ చీరెమధ్య అందమయిన స్త్రీ, ఆ అందమైన స్త్రీకి......... ఇంకా మాటలు పడుతున్నాయిగాని పెనల్ ఆక్టు అడ్డం వొస్తుంది. అయినా తక్కినవన్నీ - బూతులు వ్రాస్తున్నానని గోలపెట్టే శ్రోత్రియుల భావనాశక్తికి వొదిలేస్తాను

గుర్రం ఆగింది. నేను దిగి దూరంగా నుంచుని, తగాదా అర్థం చేసుకుంటున్నాను అంతమంది మొగాళ్ళు తనకోసం గోలపడడం 'హెలెన్ ఆఫ్ ట్రాయ్' వలె నిదానంగా గర్వంగా చూస్తోంది, ఆ పల్లెటూరి పడుచు. నా hat ని చూసి పంచాయితీకి గుంపు నన్ను సమీపించింది. ఆమె కదలలేదు. ఈ హ్యాటు పెట్టుకున్న మొగాడి వుద్దేశ్యమేమిటో ఆ తమాషాకూడా చూద్దామన్నట్టు కళ్ళు నావంక నిలిపి శాంతంగా చూస్తోంది ఆమె తగాదా వియ్యాంకులకి. పర్మిషన్ లేకుండా తండ్రి పిల్లని అత్తవారింటినుంచి దొంగిలించుకుపోతున్నాడుట.

“ఆ అమ్మాయిని అడక్కూడదా? ఆమెకి యిష్టమేమో!”, అన్న నా సలహా కొందరికి నచ్చింది. నవీనులూ, విద్యాధికులూ, కాదుగా! 'దాని ఇష్టమేమిటి?' అని అనేందుకు. స్త్రీ విద్యమీదా, స్త్రీ స్వాతంత్రంమీదా లెక్చర్లుఇచ్చి, కమిటీలలో మెంబర్లు కాలేదుగా ఆ పల్లెటూరివాళ్లు! ఆ 'స్త్రీ' వాళ్ల దృష్టికి గృహిణి, భార్య,

పిల్లల్ని కని వంశాల్ని నిలబెట్టేమాత; అర్ధరాత్రి నీరసపు నరాల బాధకి ఉపశాంతినిచ్చే మరకాదు. అలంకరించి షోకుగా చూపుకునే బొమ్మకాదు; కమిటీలకి ప్రవేశాన్నిచ్చే ద్వారంకాదు. స్త్రీల సభల్లో, పురుషుడి ఉపన్యాసాలు చదివి, కీర్తి తెచ్చుకుని, భర్తకి ఉపకరించే సాధనంకాదు.

వాళ్ళందరూ ఆమెమీదపడి ప్రశ్నల్ని కురిపించారు. ఆమె మాట్లాడలేదు. నాకు వాళ్ళిచ్చిన న్యాయస్థానాధ్యక్షతపదవి పురస్కరించుకొని ఆమెను బోనెక్కమన్నాను. కాని నా  కో అప కేటువలె ఆమె నా అధికారాన్ని అంగీకరించినట్టులేదు. కదల్లేదు. ఆమె సెక్సు ఆధిక్యతకు తలవొంచి జడ్జే ఆమెని విచారణకై సమీపించాడు. ఆమెని దగ్గరిగా చూసి రెండు ప్రశ్నలు వేసేటప్పటికే "ఛేంబర్సు" లో విచారణ చెయ్యాల్సిన కేసుగా తోచింది. ఆ మొహంనిండా [illegible] కెలసం అలుముకు వుంది. ఆ పెదమల బిగువు, ఆ చురుకుచూపు ఝాన్సీరాణీని జ్ఞప్తికి తెస్తున్నాయి. కాని ఆ చురుకు చూపులలోని చంచలం, ఆ దవడల జారు, ఆ కనుబొమ్మల తేలికతనం ఆమె హృదయాలక్ష్మి అస్థిరమంటున్నాయి. భర్తని తలుచుకుంటే దిగులేసింది. ఆ గుర్రంమీద స్వారిచెయ్యాలంటే (ముళ్ళ కళ్ళెంకూడా రెండుగా కొరికే దవడలవి) మనిషి చాలా సమర్థుడై వుండాలి. ఎంత విదిలించినా, వెనకాళ్ళతో తన్నినా, మెడతిప్పి కొరికినా, కిందపడి దొర్లినా తన తొడలపట్టు వొదలకూడదు కొరడా ప్రయోగంలో దిట్టమైనవాడై వుండాలి. కాని అంత దౌర్జన్యంలోనూ ఆమెనే అంటి పట్టిన మొగవాణ్ణి ఒక్క వూపుతో మనోవేగపు సవారితో తీసుకుపోయి యే స్వర్గద్వారాలో తెరిచి చూపదా అనుకున్నాను. ఎత్తై, సన్నై, నునుపై, కఠినమై ముందు ఎదురు నడిచే రొమ్ము - నుదుటిమీద గాలిలో నృత్యంచేసే అణగని ముంగురులు (ఎంత కత్తిరించినా కనకమ్మగారి కందని అందాలతో - వాటినే గిడసబారిన ముంగురు లన్నాడు రంగ.)... పైకి చాచుకునే (చేతివేళ్ళకి చక్కలిగింతలు పెట్టే) నడుం...ఆ భర్తని తలుచుకుంటే ఈర్ష్య కలిగింది.

ఆ గట్టిదేహమంతా, (మనసెక్కడవుంటేనేం) నాదగ్గిరిగా వొత్తుకోడం తటస్తిస్తే చాలదా ?

తన్నుకోండి, గింజుకోండి. 'పశువో పశువో!' అని గూడ వండి. చిత్రగుప్తుడికీ, ఈశ్వరుడికీ, అర్జీలు పంపుకోండి. ప్రజలూ, విమర్శకులూ, దొంగచూపులతో గదుల్ని రహస్యాలకోసం వెతికే సతీమతల్లులూ, చాతనైతే నాకా వుపకారంచేసి, ఇంకా నన్ను నరకలోకాలకి, రికమెండు చెయ్యండి.

ఛేంబర్సులోకి రమ్మంటే లేచింది ఆమె. గుంపు మా వెనకనే వొచ్చింది. వాళ్లకి ఛేంబర్సు అంటే అర్థమయినట్టులేదు. గతిలేక 'ఓపెన్' విచారణ పెట్టాను ఎందుకోగాని నాతో చక్కగా మాట్లాడింది. అత్తవారింటో వుండడమే తన కిష్టమున్నది. మరి యెందుకు బయలుదేరావని క్రాస్ కొశ్చన్ వేస్తే 'ఈ గోలలో నాకేమీ వినపట్టం లేదండీ' అని కళ్లు కిందికి వాల్చేసింది. జడ్జీగారి మెళ్ళో శా...మ్మగారు గుచ్చి యిచ్చిన వాడిన మల్లెదండేగాని రత్నాలహారమే వుంటేనా ఆమె మెళ్లో వేసును, ఆమె చమత్కారానికి.

జడ్జీగారి 'సైలెన్సు' అరుపును పార్టీలు లక్ష్యపెట్టకపోవడం వల్ల జడ్జీగారు 'విజిటర్సు గాలరీలోకి నెమ్మదిగా చేరుకున్నారు. ఆమె తండ్రితో ప్రయాణం కావడం మళ్ళీ అత్తవారింటికొచ్చేందుకు కాదని తెలుస్తోంది, అందరికీ కాని ఆమె వొప్పుకోదు. నయానా భయానా, ఆ బెజవాడ మునసబు మల్లే లాలనచేసి, అడిగితే వొప్పుకుంటుందేమో ఛేంబర్సులో. అందరి ముందూ చెప్పకూడదా, తనకి భర్తతో వుండడానికి ఇష్టంలేదని. నేను తన పక్షం తీరుపు చెబుదునుగదా అని కోపం వచ్చింది నాకు. కాని ఒకసారి అన్న తరవాత ఆమె మాట మార్చుకునేటట్లు చెయ్యడం యెవరి తరమౌతుంది! ఏంచెయ్యాలిప్పుడు ? అయినా మధ్య నేను తీర్పుచెయ్యవలసిన అవసరమేమొచ్చింది? వాళ్ళ తగాదా వాళ్లు తీర్చుకోలేరా? కాని యెట్లానన్నా... నేను...యీమెని......ఏమిటిది? పొద్దున విజిట్ చూపించకపోతే_ పొద్దునంతా ఏమిటి చేస్తున్నావని అడగరా అధికారులు?

దోవలో పల్లెటూరు పడుచు తగాదాలు తీరుస్తున్నాను. ఇది బడిపని కన్న ముఖ్యవిషయం అని—

తారీఖు ... 4-38

ఉదయం గం॥ 7-30 నుంచి 8-30 వరకు

పల్లెటూరు పడుచు తగాదా తీరుస్తున్నాను.

అని డైరీలో వ్రాస్తే—

సెన్సు ఆఫ్ హ్యూమర్ చస్తేనేగాని గవర్నమెంటులో వుద్యోగం నిలవదు. ఒక్క రామ్మూర్తి ప్రమోషన్ కోసం ఎక్లిక్లేషనులో ఈసప్పు కథ వ్రాయగలిగాడు. కాని అందరికీ గుండె లున్నాయా. గెజెట్ లో కొంచెం కులాసాగా చదువుకోడానికి వీలుగా కథలు వేయించగలిగారా దీక్షితులుగారు! నా జాతకంలో గ్రహాలప్రకారం ప్రస్తుతం ప్రమోషన్ సూచింపబడి వుంది, గనక తప్పక యిప్పించాలని పైకి వ్రాయగలిగానా నేను?

ఇంతలో యుద్ధం ముదిరింది. కర్రసాముకి తయారయినారు. కన్య ఉత్సాహం హెచ్చింది. వూరికే ఆచారానికని చిన్న యేదుపు ప్రారంభించింది. వ్యూహంలో తోవ దొరక్క చూసి చూసి విసిగి విజీటు జ్ఞాపకమొచ్చి, సైకిలెక్కాను, విధిలేక; వెనక్కి వెనక్కి చూసే old horse ని బాదుకుంటో, ఎర్రని ఎడారి బాట వెంబడి. పల్లెటూరి పడుచు లేకపోతేనేం? కలలు మిగిలాయి.

ఎన్నిసార్లిట్లా పనిలేనివాణ్ణిగా వుండి నా బుద్ధి యీడ్చినట్లల్లా ఎక్కడికంటే అక్కడికి వెళ్ళగలిగితే బావుండుననుకొన్నది! అట్లా ఆ పోట్లాట చివరివరకూ చూసి గెలిచి ఆకన్యను పొందిన వారితో ప్రయాణమై- మెల్లిగా అంతులేని ఆ కోసిన వరిపొలాలమీదనించి ఎక్కడికో తెలీని వూరికి - కాళ్ళకింది యెండుమోడు కరకరలు, గాలి వూడ్చుకుపోతో చేసే యీడుపు శబ్దం, నల్లటి యెండు కాలవ గట్టుమీద రేగడి పలుకులు, చిక్కని తుమ్మనీడలు - కాళ్ళకింద పగిలే నత్తగుల్లలు, అప్పుడప్పుడు నావంక తిరిగి చూసే ఆ వనిత, ఆ యెండు పొలంలోకూడా నిర్లక్ష్యంగా పెరిగే యెండాకాలపు కలుపుమొక్కలు, మెల్లిగా రెండు కుక్కలు, గుడిసెలు...కంపు..., బురద ... చెరువు...వూరు...

కలలుకంటో బయలుదేరాను నా నిర్భాగ్యానికి నేనే పడే దిగులు చారని యెర్రనిరోడ్డుమీద వొదులుతో.

ఎందుకు చెప్పదూ ధైర్యంగా కాపరం తనకి యిష్టంలేదని? ఎప్పుడు వొస్తుంది ధైర్యం స్త్రీకి? ఎట్లా వొస్తుంది? చదువా? నాగరికతా? లాభంలేదు. ఈమె యీ విద్యలేని అనాగరిక స్త్రీ తనకి కాపరం మరీ దుర్లభమైతే పారిపోతుంది. ఎక్కడో ముష్టి, దాసీపని, వేశ్యావృత్తి, ఎట్లానన్నా జీవించగలదు కాని చదువుకున్న స్త్రీలు, నాగరికులు ఆ మూటిలో దేనికీ పనికిరారు. అసలు యింటోంచి బండీలేంది కదలలేరు. తెగించి బైటపడ్డ స్త్రీలు - దెబ్బలు... రాడీలు...తగాదాలు...అదీ వారి చరిత్ర.

ఎప్పుడూ యీ స్త్రీ ఒకరకం నీచత్వంలోంచి యింకోరకం నీచత్వానికి వొగ్గవలసిందేనా యిట్లా! అన్ని యీవిల్సుకీ (evils) మందు విద్య అంటారు మాట్లాడితే! ఏంచేస్తుంది విద్య? కోర్టులకీ, ఓట్లకీ, నోట్లకీ తయారుచేస్తుంది, స్వేచ్ఛగా తిరిగే మనుష్యుల్ని! ఎవరికి స్వేచ్ఛనిచ్చింది యీ విద్య!

ఈ నాటి యువకులకిమాత్రం వాళ్ళు యెవరిని పెళ్లి చేసుకున్నా వాళ్ల కళ్ళు విద్యావతుల ముఖాలకేసే యెత్తివుంటాయి. విద్యగల వొస్తువును తాను పెళ్లి చేసుకున్నానని అందర్నీ యీర్ష్య పడేసేట్టు చూపించుకోడానికి తప్ప భర్త ఆమెనుండి యేంసుఖ మనుభవిస్తున్నాడు! సంసారానికీ, వంటకీ, కనడానికీ, పెంచడానికీ యీవిద్య యేమీ ఉపయోగపడదు. పైగా అభ్యంతర పెడుతుంది.

ఎంతైనా కానీ, యీ sex కోర్కె—— భార్యా భర్తలమధ్య వుండే ఆకర్షణకూడా sex మరిచిపోకండి, నీతిపరులూ; సంసారులూ, ఆధ్యాత్మిక భర్తలూ, ప్లేటోనిక్ కవులూ ... యీ sex ఆకర్షణా, పిల్లలమీది ప్రేమా—— ఇవన్నీ భూమిలోనించి - చెట్లకి కాయలిచ్చే భూమిసారానికి చాలా దగ్గర అవి. విద్యలూ, fashions కవిత్వం, ఆధ్యాత్మికాలూ, మర్యాదలూ, రోగాలూ. కపటాలూ - ఎక్కువైనకొద్దీ - దూరమౌతారు అసలు నరాల్లో, వెనుకల్లో పొందే శాంతికీ, సౌఖ్యానికీ తిండి సరిగా వంట పట్టడం, పక్కమీద నరాలు శాంతిపడడం, పిల్లల పాలదాహం, తీర్చడంలేంది, స్త్రీ అంత క్షుద్రురాలూ, వ్యర్థురాలూ, పాపిష్టీ, నరకవాసీ, ఎవరూ వుండరు.

వీటినించి దూరంచేసే, చదువూ, దేవుడూ, నాగరికతా, నీతీ—
అంత అనర్థాలు, విరోధులు, మృత్యువులు - ఇంక కనపడవు.

ఇంక స్నేహమూ, పరిసంగమూనా? దానికి వుద్యోగస్తులకి వ్యవధే వుండదు. అయినా యిద్దరు పిల్లలు పుట్టింతరవాత తగాదాలు లేని ప్రసంగాలే వుండవు. అదిగాక యెంత చదువుకున్నా, యెన్ని పరీక్షలు గట్టెక్కినా, తాముచదివింది వంటపట్టించుకొని యే విషయమైనా ఒరిజనల్‌గా మాట్లాడగల స్త్రీలు చాలాతక్కువ. మాటలు విన్నా ఉపన్యాసాలు విన్నా వుత్త చిలక పలుకులు. అసలు జన్మవల్ల సంస్కారం కలిగిన స్త్రీలున్నారు గొప్పవారు, పల్లెటూళ్లల్లో. కాని చదివి గొప్పవారైన స్త్రీలు యీ దేశంలో లేనట్లున్నారు. మళ్ళీచదువువల్ల చక్కని పాలిష్ వొచ్చిన పురుషులున్నారు.

దుష్టఆచారాలు మాని, నవీన పద్ధతుల్ని అవలంబించి గృహాన్ని ఆనందపరుస్తారా? ఏమీలేదు. ఒకపురాతన ఆచారం బదులు, అంత నిర్జీవమైన యింకో నవీన ఆచార సంప్రదాయాన్ని నేర్చుకుంటారు. వాటి ననుసరించని వాళ్ళని ఖండించి, సాంఘికంగా తక్కువగా చూస్తారు. బట్టలో, కట్టులో, మాటలో, తిండిలో అన్నీ అతి కఠోరమైన నిబంధనలు. fashion మర్యాదదొంగ దేవతల పీఠంవద్ద నిత్యం కొలువు ఆ దేవతకోసం భర్తసౌఖ్యం; పిల్లల స్వేచ్ఛ బలి. ఈ విద్యావంతులూ, సంస్కార ప్రియులూ, వీళ్ళంత ఆత్మవంచితులు యెక్కడా లేరు.

స్వేచ్ఛ! స్వేచ్ఛ! స్త్రీలకి స్వేచ్ఛ! పిల్లలకిస్వేచ్ఛ! కార్మికులకి స్వేచ్ఛ! మామూలు మాటలు, ప్రతి వాళ్ళనోటినుంచీ యీమాటలు. ఆ స్వేచ్ఛాదేవత ప్రత్యక్షమయిందా? కావలసినస్త్రీ, పెంచిన పిల్ల, పోషించిన నౌకర్లు, పాకుతున్న కుక్క - రూపాన స్వేచ్ఛ కావాలని ఎదురుతిరిగి కళ్ళముందు నిలబడ్డదా ఆనర్థాన్ని భరించగల మనుష్యులెందరున్నారు? సేచ్ఛ! ప్రతివారికీ స్వేచ్ఛ! ఎక్కడ వుంది ఆస్వేచ్ఛ జీవితంలో? బంధంనించి బంధనానికి పాకితేనేగాని నిలవలేని యీ బతుకులో! మాయమీద మాయ కల్పించుకొని కప్పుకుంటేనేగాని కళ్ళు తెరవలేని యీ ప్రపంచంలో!

ఈ స్వాతంత్ర్యపుస్త్రీలు వేశ్యల్ని అనుకరించాలని ఎంతో ప్రయత్నంచేస్తారు - ఒక్క ఆకారంలోనే కాదు. వేశ్యలు కొన్నాళ్లు

బోర్డింగు స్కూళ్లు పిల్లల్ని అనుకరించారు. కాని ప్రస్తుతం అందరూ కలిసి సినిమా స్టార్లని ఆదర్శంగా పెట్టుకున్నారు. జుట్టు పైకి కట్టడం, పువ్వులు కిరీటాలవలె గుచ్చడం; ఇవన్నీ తమ తక్కిన ఆకారానికి సరిపోతాయా, లేదా అని యోచించరు. ఎందుకీ అలంకారం? ఎవరి కోసం అని ప్రశ్నించుకోరు. ఈ జెనరేషన్ స్త్రీలు యిట్లా కళ్ళ ముందు మారిపోతూవుంటే వాళ్ళనేమీ అనలేక, యెట్లా అభ్యంతర పెట్టాలో తెలీక, గుడ్లు మిటకరించిచూస్తో, ఊరుకొంటున్నారు, పెద్ద ముత్తయిదులు.

మొన్న ఒక్క బాడుగ కారులో ఒక అమ్మాయీ యిద్దరు యువకులూ, అతివేగంగా వొచ్చారు పెట్రోలు పంపు దగ్గిరికి. రాత్రింతా ఎక్కడో గడిపినట్టున్నారు. ఎక్కడికో అతివేగంతో పోతున్నారు. ఇదే "life" ఏం గొప్పవాళ్లమో చూస్తున్నారా? అంటున్నాయి వాళ్లముఖాలు. ఆ అమ్మాయి జుట్టునిండా, ముఖం మీదనించి ఎడం లేకండా పిన్నులు. జుట్టులో ఎన్ని పిన్నులు, రంగుల రిబ్బన్లు జాకెట్టుకి ఎన్ని కుచ్చులు, చీరెకి ఎన్ని అంచులు, ఎంత పౌడరు - ఎంత స్నో — ఎన్ని ఎక్కువగావుంటే అంత అందం, అంత ఆకర్షణ, అంత సాంఘిక విలువ! లెఖ్ఖ, తూకం ... ఎన్ని ముద్దులు - ఎన్ని సార్లు, ఎన్ని రాత్రులు - ఎంత దూరం - ఎంతమంది- ఇవీ శృంగారపు కొలతలు.

'పాపం' లో వుండే ఆకర్షణనికూడా చంపేస్తే, నరకంలో వుండే శృంగారాన్ని లాగేస్తే ఇంక దిక్కెక్కడ! ఆశ్రమాల్లో తప్పు!

నిన్న బస్సులో నాకెదురుగా కూచున్న యువతిలో కలిగిన ఐడిల్ ఇంటరెస్టుతో యిద్దగమూ అరగంట సరదాగా గడిపాము. చూపుల్లో చిన్న కదలికల్లో గొప్ప భావప్రకటన చెయ్యగల స్త్రీలని చూస్తే చాలా సరదా. చాలా కొద్దిమందే ఆర్టిస్టులున్నారు, యీ దేశపు స్త్రీలలో. బస్సు ఆగింతరవాత విడిపోతాము. మళ్లీ యీ జన్మలో కలుసుకోము. కాని ఆ కాస్తసేపూ ఆడుకోవచ్చు. నేను బస్సు నధిష్టించినప్పుడు ఆమె బుజాల మధ్య వెడల్పయిన వీపూ, సన్నని నడుమూ, బండరాయిమీదనించి జారే పామువలె జడా - యింతే కనబడుతున్నాయి. ఆమె కొంచెం వ్యాయామం చెయ్య కూడదా, ఆ జబ్బలికి చక్కని వొంపు వొచ్చేది అనుకున్నాను.

చాలామంది ఆడవాళ్ళకి వీపుకి కళ్ళుంటాయి. నా సైలెంటు ఎప్రీసియేషన్ కనిపెట్టింది. కొంచెంగా ఆ వీపు చలించడంలోనే తెలిసింది నాకు; తనముందు తన మొగవాళ్లు కూచున్నారు. నేనెవరో, సంగీతమిటో డైరెక్టుగా తిరిగి చూడ్డానికి వీల్లేదు. అందుకని యిటూ అటూ కొంచెం ఫిడ్జెట్ చేసి, ఏదో వినుక్కుని, పమిటి సర్దుకోడానికని లేచి, ఒక్క చూపుతో గ్రహించి, పక్కకి తిరిగి, తన ముందుభాగంలో సగమూ, ముఖం ప్రొఫైల్ ని నాకిచ్చేసింది, చాలా దయతో. దాంతో ఆమె తన పురుషులకీ నాకూ తెరఅయిపోయింది కూడాను. అటు తర్వాత అతి నేర్పుగల ఫెన్సింగ్. నాకంట బడకుండా నన్ను స్టడీ చేయాలని ఆమె ప్రయత్నం. డైరెక్టుగా ఆమె చూపుని నా చూపుతో క్రాస్ చేసి కట్టివెయ్యాలని నా పంతం.

స్త్రీల అందాలు చూడాలంటే వాళ్ళు యేదో పనిమీద వుండగా అన్ కాన్షస్ మూమెంటులో పట్టెయ్యాలి. గొప్ప సంగీతం వినాలన్నా అంతే. నిన్న చిన్నప్పుడు నే నెరిగిన పిల్ల ఎదిగి పెద్దదై చూడ్డానికి వొచ్చింది. వెళ్ళేటప్పుడు లేచి నుంచుని వెనక్కి తిరిగేటప్పుడు ఆ నడుంనించి మెడవరకూ ఆమె చూపిన కదలిక ఏ మాటలు, ఏగీతలు, ఏ రంగులు కాచ్ catch చెయ్యగలవు? 'యింకోసారి' అని అరిచింది నా శృంగారభావం. మాటలతో నేను అరిస్తే ఆమెకేం అర్థమౌతుంది? కావలసి నేర్చుకున్నది కాదు. తరతరాల నించి రక్తంలో సంక్రమించిన శృంగారభావం. ఆమె అంత గొప్ప ఫ్లాష్ flash చూపి నాకళ్ళని చెదర కొట్టిందని ఆమెకే తెలీను. అల్లాంటప్పుడు ఏం చెయ్యగలం? ఒక వేళ సిగ్గూ, అభిమానమూ వొదిలి ఆమెకి నామీద వున్న కాన్ఫిడెన్సు భగ్నం చేసుకొని ఆ పిల్లని కావిలించుకుంటే చేతికి యేమి అందుతుంది?

బాయి లక్ష్మిబాయి పాడుతోంది ఇప్పుడు. ఆమెని కావిలించుకుంటే ఆ సంగీత మాధుర్యం నాకెంత దొరుకుతుందో, నిజమైన అందంకూడా అంతే దొరుకుతుంది చిన్న పిల్లల ముద్దుమాటల్ని, అందాల నవనవల్ని చూసి భరించలేక వాళ్ళని నలిపి యేడిపించే మూర్ఖుల్ని చూడడంలేదా? అట్లానే స్త్రీ సౌందర్యం నాశనంచేసి తృప్తిపడాలని చూస్తారు ప్రజలు.

ఉత్త అవయవ సౌష్టవమే కాదు, ఆత్మమాధుర్యమే కాదు, దేహం

కదలికలో, చేతుల చలనాలలో, కళ్లచూపుల వుపయోగంలో వుంది; చాతుర్యమూ శృంగారమూ. నా అస్ఖలిత బ్రహ్మచర్యమూ చెడలేదు, నా బస్సుకన్య పాతివ్రత్యమూ భంగంకాలేదు. కాని రతి సమరంకన్న యెక్కువ ఇక్ టెన్సు అయిన అనుభవాన్ని పొందాము చిన్ని చిరు నవ్వులతో, ఏ సౌంజ్ఞాలేని ఆహ్వానాలతో, ఛాలంజీలతో, ఎదురు కదలికలతో. ఇది పాపమైతే చిత్రగుప్తుడు యే పద్దులో ఏ కాలంలో column వ్రాస్తాడో! పురుష ఆకర్షణ నెరగకుండా కాపరాలు చేసే పతివ్రతలారా ఇదంతా ఖండిస్తారా? ఈమాత్రం సౌందర్యాకర్షణనికూడా ఎన్నడూ జీవితంలో యెరక్కపోతే, మీకు స్వర్గలోకాలు రావొచ్చునుగాని రాళ్లని తీసుకుపోయి అనుభవించ మని స్వర్గంలోపారేసి యేం లాభం?

ఎంతదాచుకోనీ, నటించనీ, అలంకరించుకోనీ, మనుష్యులు ఏదో వో సమయంలో దొంకిపోతారు. నిజస్వభావం వెల్లడిస్తారు. రా— ప్రేమ కనబరచడానికి ప్రయత్నించి అందవికారమౌతుంది. పాపం! వి—ఏడిస్తే అసహ్యమేసేది. హై—కోపమొస్తే పిశాచమయ్యేది. శ్రీ—బతిమాలేటప్పుడు కోతిమూపుదాల్చేది. వెం—నవ్వితే నాకు వొళ్లుమండేది. కా — భయమేస్తే నీచత్వం వెల్లడయ్యేది. సుబ్బారావు C% గంగానమ్మ "ఈనాడుకాదు, అబ్బాయ్, వీళ్లతో తగాదావచ్చినప్పుడు తేట పడుతుంది వీళ్ల నిజస్వభావం. చక్కని చీరెలు కట్టుకుని నవ్వుతో పువ్వులు సర్దుకుంటో నీతో కులుకుతో బాగా సేవుంటారు. ఏనాడో కోపమొస్తుంది. అప్పుడు నోరువిప్పి వీధివెంట పడితే—" అంటాను.

అట్లానే బస్సులో కాంత కాలుమీద కుచ్చెళ్లు కిందకి లాక్కడానికీ, తన నడుంవంపు నాకుచూపడానికీ, కిందకి వొంగి నప్పుడు, ఎందుకో ఏం తెలియజేయడానికో పైపెదవి ఒకపక్క కొంచెం పైకి లాగినప్పుడు ఒక్కసారిగా ఆమె పూర్వీకులు— అవ్వలు, తాతలు, అత్తలు, అందరూ వారి అల్పత్వంలో, వెకిలి తనంలో, ఆమెచుట్టూ మూగారు. సరిగా ఇట్లానే పెదవి పైకి లాగుతో చిరునవ్వు ప్రపంచంమీద కుపించే ధన్యురాలితో ఒక రాత్రంతా రైలులో ప్రయాణం చేశాను కాని యీ అలవాటే యీ పెదవి కొంచెంగా పైకికదల్చడమే ఆమెలో అద్భుత సంస్కా

రాన్నీ వంశగౌరవాన్నీ, ఆత్మ సౌకుమార్యాన్నీ, వ్యక్తపరిచింది. ఆ విధమైన పనే యీ ఆమె రక్తిమాలిన్యాన్ని చాటింది నాకు. ఈమె జుట్టు నిగనిగ, యీమె దేహమార్దవం, ముఖంలోని శాంతభావం కళ్లలో ఆసక్తి, అన్నీ పైమెరుగులు. అసలు రక్తం వేరు. నా చేతులలో గీతలమల్లెనే యీ అక్షరాలవల్లనే, యెంత దాచినా, ప్రపంచం ముందు, బట్టవిప్పి నుంచో పెడతాయి. ఒక్కొక్క చిహ్నాలు. నేనెంత నా స్వభావాన్ని తెలీకూడదని పదిలంగా దాచి వ్రాసినా ఏవొక్క మాటో నా వేదాంతమంతా పైమెరుగని అరక్షమండే నాకోర్కెలే నా రక్తమనీ బైటపడేయ్యొచ్చు.

చేతకాదు కాని, ఇట్లాంటివి, బొమ్మలు గీసి చూపాలనిపిస్తుంది. చిత్రకారులకి తెలుస్తుందనుకుంటాను. ఒక్క చిన్నగీత పెదవి చివర, గడ్డంవొంపులో, కనుకొలికిలో, కొంచెం యిటూ అటూ వొంచడం వల్లకాని, చంపలమీద, కళ్ళపాపలో, ముక్కు యెత్తుల్లో, రంగు చిక్కదనం మార్చడంవల్ల గాని ఒకే బొమ్మ స్వభావంలో యెంత మార్పు చూపించవచ్చు! ఇదుగల్లనే యింత గంభీరమూ, ఆశ్చర్యకరమైన విషయాలు గమనింపనప్పుడే ఈశ్వరుడే వుంటే అతనెంత పర్ఫెక్టు ఆర్టిస్టు (Perfect artist) గొప్ప చిత్రకారుడో, ఎంత కళాశాలి ఐవుంటాడో, అనిపిస్తుంది మళ్లా కళా లేదు దేవుడూ లేడు. అంతా యీ మనస్సు కల్పించుకున్న ఇంద్రజాలమని తోస్తుంది.

ఈ మల్లెపూలని సూదికి గుచ్చడం కష్టంగా వుంది. వాటి హృదయాల్లోంచి యీ దారాన్ని లాగుతున్నట్లుగా బాధగా వుంది నాకు. అవి ఇంకా పసిపిగా వున్నప్పుడే యీ మొగ్గల్ని కోసి, గుప్పెట్లో పట్టుకొని బుట్టలో అదిమి, వేళ్లతో నొక్కులు పెట్టి యిట్లా గుచ్చి, బాధించినా, ఎండించి, పాడుచేసినా, సాయంత్రమయ్యేసరికి పాపం, అవి వికసించి పరిమళాన్ని లోకంమీద వెదజల్లుతాయి. భతృహరి యేమంటాడో!

ఒకరోజు ఒకరు నాకెంతో అప్యాయంగా యిచ్చిన మల్లెమొగ్గని వదల్లేక, జేబులో వేసుకుని మరిచిపోయినాను. సాయంత్రం కాలవగట్టుదగ్గిర మల్లెపూలవాసన వేసి చుట్టూ వెతికాను, తోటలో వుందేమోనని. చివరికి నా జేబుని గుర్తుపట్టి, చూస్తే, తెల్లగా పెద్ద

దిగా విచ్చుకొని నా వేళ్ళని పలకరించింది! నా జేబులో మరిచిపోయిన నా మల్లెమొగ్గ! కళ్లంబడి నీళ్లు తిరిగాయి.

మాట్లాడకండా కళ్లు తెరుచుకుని చూసే పసిపిల్లలు- మబ్బుల మధ్య పరుచుకున్న చిక్కని ఆకాశం. యివి తలపుకు వస్తాయి వెనక్కి విరగబడే రేకలతో మొహంమీదకి చూసే మల్లెపూవుని చూస్తే. ఎట్లాగో- మాటలతో కాదు- చూపులతో కాదు- పరిమళంతో కాదు- ఎట్లానో చెప్పలేను- యీ యింద్రియాలకీ మనసుకీ చాతకాదు. ఎప్పుడో ఏ ఒక్క త్వరితక్షణికంలోనో స్ఫురించి మాయమవుతుంది- ఆ అనుభవం- యీ పువ్వుతో ఆత్మసంబంధం కలగచేసుకోడం- "నేను నువ్వు" అనుకోడం, తెలియజెయ్యడం ఆ మల్లెఆత్మతో. తక్కినప్పుడా? వుత్తమల్లెపూవులు- అతిచవక- శేరు అర్ధణా- మెళ్ళలో, తలలమీద, పక్కల్లో, కాళ్లకింద- అంతటా మల్లెపూలు, అందరికీ మల్లెపూలు.

మల్లెపూలు ధరించడానికీ, కుక్కని పెంచడానికీ, అధికారం కొందరికే యిస్తే బావుండును, ప్రభుత్వమో, దేవుడో!



నా ముందు కొలనులో లేయెరుపుతామరలు మెల్లిగా తెరచుకుంటున్నాయి. సరిగా సమయానికి యే శక్తి యీ పువ్వుల్ని వికసింపచేస్తుందో ఆశ్చర్యంకాదూ? జంతువులకి మాత్రమే ప్రాణమున్నట్లూ యీ వృక్షాలని యెన్నిటిని చంపినా యేమీ తప్పుకానట్లు మాట్లాడతారు, మాంసభక్షణ చెయ్యని నిర్మలోదరులు! చంపి తినకండా బతకలేము చెట్లనో మృగాలనో. అనవసరంగా చెట్లని చంపడం, అవసరంగా మృగాలని చంపడంకన్న చాలా పాపమని గుర్తించలేరు ఎవరో జంతుబలులు జరక్కుండా శాసనం చెయ్యాలనే వాళ్లకి ఎంత దయ జంతువులమీద! పంజరాల్లో_చిలకల్ని వదలమని సత్యాగ్రహం చెయ్యరాదూ? zoo "జూ"లో జంతు ప్రదర్శనశాలల బోనులు విరగతన్నరాదా? సర్కసులకి మనుషుల్ని వెళ్లి చూడవొద్దని ప్రచారం చెయ్యరాదూ? బలిపడే జంతువుల రెండు సెకండ్ల బాధకన్న, పెద్దపులులు నాలుగు గజాల బోనుల్లో యావజ్జీవనమూ పడే బాధలో ఎన్నోవంతు? కటికవాడి చేతుల్లోచచ్చే పడుచుఆవు బాధకన్న, గోసంరక్షణవాళ్ల ఆత్మలకి స్వర్గం వొచ్చేందుకు, ఊరేగింపుల్లో కాళ్ళీడ్చుకుంటో తిరిగే ముసలి రోగిష్టి ఆవులబాధ ఎన్నిరెట్లు?

ఇదంతా తెలీదు. తెలుసుకోరు. అంతా మతం, శాస్త్రాలూ, అన్నిటికన్నా "సెన్టిమెంటు". మెదడు చాలామందికి పెట్టడం మరిచిపోతాడు, ఆ చేశేఆయన.

హృదయాల్లో నిజమైన దయాస్రవంతి ఉదయమైనప్పుడు జంతుబలుల వేపుకాదు; దిన దినమూ మన ఎదట జరిగే నరబలులవైపు ప్రవహిస్తుంది.

జంతువులు నోరులేనివి. చెట్లూ? గొడ్డలికింద రక్తంకారేచెట్లు, బూడ్సులకింద నలిగే గడ్డి, పువ్వులన్నీ కోసుకుపోతే ఏడ్చే మొక్క— వీటిమీద కారుణ్యంలేదా? నోరు లేదు గనక నేనా?

ఏం తింటున్నాము, ఏం చంపుతున్నామని కాదు ప్రశ్న! హృదయంలో యెంత దయ యెంత సానుభూతి వుందనేదే ముఖ్యమైన విషయం. ప్రజలని కొరుక్కు తినకపోతే చాలు దయాపరులు!

పుస్తకాల్లో యీనాటికికూడా నవకవులు సహితం ఉదయాన తామరలు వికసించడమూ, రాత్రిలు కలవలు పుయ్యడమూ, పద్యాలలో వర్ణిస్తోవున్నారా! అట్లాలేదు, నిజంగా, యీచెరువుల్లో పువ్వుల్ని చూస్తే. కలవలు పగలు వికసించి లోకంలో కవులనదర్శి దిక్కరిస్తున్నాయి. తామరలు సాయంత్రమైనా వికసించే వుంటున్నాయి, ఖండకావ్యాల్ని చూసి యేమాత్రమూ భయంలేకుండా. కాని గొప్పగొప్పవారమని పిరప్పిగే కవులు యింకా కృతయుగం నాటి వర్ణనల్లో మూలుగుతూ వుంటారు. చకోరాలు, హంసలూ, కలవలూ, గండభేరుండాలు, తంగేటిజున్నులూ, చక్రివాకాలు నవకవిత్వనిండా. మతంపేరట యేకృత్యమైనా చలామణి ఐనట్టే కవిత్వంపేరట అసందర్భమైనా మెప్పు పొందుతుంది.

మెల్లిగా తలలువొంచే యీ తామరల్ని చూస్తే తాయారు జ్ఞాపకం వొస్తుంది. ఆమెది గులాబి తామర రేకులమధ్య వుండే శరీరకాంతి. ఎండ తాకిన తెల్లని మబ్బులమీద గులాబీ కొంచెం యెరుపులోకీ, మళ్ళా తెలుపులోకి మారుతుండే, ఆ మార్దవమే యెండ తాకని స్థలాల ఆమె వొంటిమీద కనిపించేది. వేళ్ళు తాకినచోట చప్పున యెర్రబడి చుట్టుపక్కల కొండశిల ఛాయలన్నీ మారేవి. ఎండలో వాంపి కొండశిలలకింద లేతనీడలు చేరినట్టే, ఆమె గడ్డంకిందా రొమ్ముకిందా చీకట్లు నిద్రపోయేవి. బొమ్మవంటి ఆ చిన్నదేహం యే గులాబి చలవరాతితోనో ఏ విగ్రహకారుడో చెక్కినట్లుండేది.

ప్రబంధ కవుల వూహలకెదురు తిరిగి, ఆమె హృదయాన్ని, బ్రహ్మ పాషాణంతో గాక ఆమె శరీరం మార్దవంవలె నవనీత సమానంగానే తయారుచేశాడు

ఆపుకోలేని జాలి ఆమెనెన్నో కష్టాల్లోకి దించింది! ఎన్నో కన్నీళ్ళు కార్పించింది ఆమెజాలి! ఎంతో నలిగిపోయింది ఆ పసిపాప. ఏ కనికరమూ యెరగని, సౌందర్య లేశాన్ని అపవిత్రం చెయ్యకుండా వదలలేని, పురుషపుంగవుల చేతుల్లో, స్వార్థత తప్పు యే

ప్రేమనూ దయనూ యెరగని, యీ పుణ్యసతుల పవిత్రపు నాలుకల మధ్య యెన్నో గాయాలు పడ్డది! సామాన్యులకి ఉచ్ఛరించడానికైనా తగని ఆ హృదయదౌర్బల్యం, ఎదటివాడి దొంగబాధనికూడా సహించలేని, మోసాన్ని గుర్తించ తలుచుకోని, ఆ తీవ్రవిశ్వాసం. ఎంతో అపవాదు పడ్డది - జారత్వం, పశుత్వం, కొవ్వు, ఇక్కడ వ్రాయకూడని పేర్లెన్నో! జాగ్రత్త, అనుమానం, ద్వేషం, ప్రతిష్టమీది ప్రేమ — యివన్నీ పుణ్యావాసాలలో సులభంగా సుఖిస్తున్నాయి యీనాడుకూడా!

రోడ్డుమధ్య నుంచుని —

"మా యింటికి రావా" అన్నాను.

"రాకేమి! యెప్పుడు?"

ఆశ్చర్యపడి చూశాను. ఇంకా పూర్తి పరిచయంలేని నాతో అంత శుభ్రంగా మాట్లాడింది. ఈర్ష్యలో పుట్టి ఈర్ష్యలో వూరే పురుష హృదయం తబ్బిబ్బు పడ్డది. ఇంత సుహృద్భావం నాతో నేనా! ఇంకా — అనే నా శంకత్వాన్ని గట్టిగా నొక్కిపట్టాను.

ప్రేమదానం, తరవాత స్త్రీ యివ్వగలది సౌందర్యదానం. తాయారు యెన్నడూ ప్రేమహృదయం, ఆత్మసంయోగం యిట్లాంటివి మాట్లాడలేదు. తన దేహంవల్ల యింకోరు సంతోషించారంటే వారి సంతోషమే ఆమెకి సంతోషాన్నిచ్చేది. అట్లాంటి ఉదారత్వం గల స్త్రీలు చాలా సకృత్తు. తనకేమి యిస్తున్నాడనికాదు, తానేమి యిస్తున్నానని ఆమె ధ్యాస. పురుషుడి కళ్ళలో ఆరాధనని చూసి చిన్నపిల్లవలె కిలకిలా నవ్వుతుంది. తన శృంగారపు విలువని, తన శరీర బహుమానాన్ని తన కిష్టమైన పురుషుడు అనుభవించి ఆమోదిస్తున్నకొద్దీ ఆమెకి ఉత్సాహం. సులభంగా తనని లోకం చేసిన న్యూనతని ఆమె గుర్తించనన్నా గుర్తించలేదు. తనని చూసి వెక్కిరించే లోకంమీద పసిపిల్లకి ఏం కోపమొస్తుంది? ఎవరన్నా ఎత్తిపొడిచే మాటలు ముఖంమీద అన్నా తనూ నవ్వేది. అసూయ, ద్వేషం, ఇతరల్ని గాయపరచడం యిటువంటి గుణాలు ఇతరుల కన్న స్వంత వారినే యెక్కువ బాధిస్తాయని వివేకవంతులు వాటిని వొదులుకుంటారు. అపురూపమైన కొందరు అసలు వాటిసంగతే

రొరగరు. ఏ పూర్వ జన్మలలోనో వాటిని వొదిలి సంస్కరించు కునే పుడతారు.

ఆగుణాలు వారికి కలగనే కలుగవు. అట్లాంటివి తాయారు. ఎవరిలోనన్నా మన మోసుగుణాన్ని గుర్తించామా, ఆ సుగుణం పూర్తిగా లేదన్నమాట వారిలో. ఇంకా ఆగుణాన్ని సాధన చేస్తు న్నాడన్నమాట.

ఏ దుర్గుణం అసలు ఏమీ ఎవరిలో ఏమాత్రమూ లేదో, అది లేదని ఎవరూ గుర్తించరు. "అహా, యీ దుర్గుణం మీలో లేదు" అని ఎవరన్నా 'సిన్సియర్' గా అన్నారా, ఆ దుర్గుణం కొంచెంగా ఆ అనబడ్డవారిలో; అంతకన్న అధికంగా ఆ అనేవారిలో వుందన్న మాటే". అనక్కర్లేదు. అనుకున్నా చాలు.

ఎవరన్నా పెద్దమనిషితో, ఇంకోరు "తమరూ చాలా పుణ్యా త్ములండీ, పసిపిల్లల్ని నిష్కారణంగా గొంతు పిసకరు." అంటారా? అంటే, విన్నవారు అనుమానపడరా; ఆ యిద్దరిని గురించీ.

శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు.

ప్రహ్లాదుడు భక్తుడు.

దమయంతి పతివ్రత—

అని అనగానే, అనబడ్డవారూ, అనేవారూ, అనుమానాలకి లోనవుతారు.

మనిషి అభివృద్ధి చెందినకొద్దీ, అతనిలో colourlessness ఎక్కువవుతుంది. సుగుణాలూ, దుర్గుణాలూ, కనిపించడం తక్కు వవుతాయి. గొప్ప సుగుణాలు ఎవరిలో గట్టిగా కనపడతాయో, వాడుచాలా Hypocrite. జాగ్రత్త.

ఒకరిలో గొప్పతనం కనపడుతుంది. కాని నిజమైన గొప్ప తనానికి కారణాలు కనపడవు.

స్త్రీ సేవక కావడంవల్ల, స్త్రీ సౌందర్యాన్ని పూజించడం మానేశాడు పురుషుడు. కృతజ్ఞతాభావం నశించింది. గేదె అప్పు డప్పుడు తంతుందిగనక, పాలిచ్చినప్పుడు గేదెమీద కొంతకృతజ్ఞత వుందిగాని, దేహమర్పించే స్త్రీమీద అసలు లేదు. స్త్రీ గేదెకన్న హీన స్థితికి, పకోడీ విలువకి దిగింది. పురుషుడూ అంతే అయినాడు స్త్రీకి. ఎందుకంటే చాలామంది పురుషులకి భార్యకన్న గతిలేదని,

ఆ భార్యకి తెలుసును గనక. ఎక్కడో కొత్త పెళ్లికూతుళ్ల సిగ్గుల్లో నూ, ఘాటైగా దేహసౌఖ్యానికే బతికి, లోకమంతా వుమ్మేసి, వేశ్య కన్న హీనంగా చూసే, పోకిరీ వీధిస్త్రీల మాటలలో తప్ప, యింక యెక్కడా కృతజ్ఞతాభావం కనపడదు. తనకి లోబడనన్నాళ్లు ప్రాధేయపడతాడు పురుషుడు. పార్వతివి, దేవివి, తల్లివి, రాణివి, కోయిలవి, రంభవి అంటాడు. చేతికి చిక్కిందా మామిడిపండును చీకినట్టు అనుభవించి టెంకను విసిరి పారేసినట్టు పారేస్తాడు స్త్రీ కూడా పురుషుడికోర్కె సమాప్తికాగానే దెబ్బతిన్న నక్కమల్లే వొంగి దూరంగా పోతుంది. నరాలలో జనించే దివ్యసౌఖ్యంలో ఒకరితో ఒకరు పకపక నవ్వడమూ, కృతజ్ఞతతో ఒకరి నొకరు చూసుకోవడమూ అరుదైపోయింది. అటువంటివి వుంటాయని వ్రాసిన వాడూ ఆ సౌఖ్యాలు పాపాలు కావన్నవాడూ పాపాత్ముడూ, అవినీతి బోధకుడూ, దేహలంపటుడూ అయినాడు. తాయారువంటి స్త్రీలని లోకం కరిచి దూరంగా తరుముతోంది.

ఈస్థితి సామాన్య మానవులలోనే కాదు, నన్నయభట్టునూ, షెల్లీనీ తన్ని పుట్టామనీ, శృంగారాలకి ప్రణయాలకి హృదయాలు ఆలవాలాలనీ విర్రవీగే, నేటి కవులలోకూడా చూడవచ్చును. వలచి పొందని స్త్రీనిగూర్చి కవిత్వాలు, తాము వలచి తమని వలవని కన్యల కోసం గీతాలు, మరణించిన భార్యలమీద విలాపాలు గంపెడు. ఆ కన్య తమని పెళ్ళాడిందా, తిరిగి ఆ చచ్చినభార్య ఆత్మ కొత్త భార్యలో దర్శనమిచ్చిందా, యింక కవిత్వం ఆఖరు. అంతటితో మొత్తానికి ప్రేమగీతాలు వెలువడవు. సంసార తాపత్రయాల మీదనైనా, సంభోగ జుగుప్సలమీదనైనా వ్రాయరుగదా నాలుగు ఆరోగ్యకరమైన కందాలు!

ధనం దానంచేశారు, అన్నదానంచేశారు, భూమి దానంచేశారని గొప్పగా చెప్పుకుంటారు. రసికులఆర్తికి స్త్రీ తనదేహం దానం చేసిందంటే మండిపడతారు. మళ్లీ ధనాలుపోసి, కట్నాలని, వరశుల్కాలని దేహాల్ని కామాల్ని కొనుక్కుంటూనే వున్నారు, మర్యాదగా సంసారాల్లో. గొప్ప గొప్పవారు వరుల్ని, కన్యల్ని, గొడ్లనులాగు విలువలుకట్టడం వింటాను ప్రతిరోజూ. తనస్వార్థమే మరిచి తన అందంలో యితరులు పొందే ఆనందంలో తానానందపడే తాయారు, తనకోసం

వాంఛపడే పురుషుడి దీనత్వాన్ని చూసి విలవిలలాడే తాయారు, ప్రపంచపు వాస్తవపు విలువల్లో తలతంతుంది, యీ విశ్వదాతల్ని, దానకర్ణుల్ని! దగ్గిరికి వొస్తే నిజంగా నేతన్నేది.

ఎక్కడవుందో, యేం చేస్తోందో, యిన్నేళ్లు కనపడకుండా యేమయిందో! ఈ తామరాకులమధ్య కనపడే మృదువైన లేయెరుపు రంగుచూస్తే ఆమె బుజాలక్రింద యెరుపే జ్ఞాపకంవొస్తోంది. అచ్చు తెలుపుకింది రక్తపు వుబుకు!

తాయారు సాంఘికంగా cut cast పలకరించేవారు లేక ఒక్క మంచిమాట అనేవారు లేక దిక్కులేక మాడిపోయిన ఆ అధము రాలు. ఆమె జీవిచరిత్రలోంచి నేనెరిగిన ఒక చిన్నపుట చదువుతాను పతివ్రతల్లారా, ఆమెని గుమ్మాలపక్కకి చేరనీని నీతిచరిత్రలారా, వినండి. హృదయమన్నాయత్తమై, ఆమెని మనఃపూర్వకంగా ఆదరించని నా దౌర్భాగ్యానికి పశ్చాత్తాప పడతానివాడు

అతను అప్పుడే స్త్రీలోకంలో కళ్ళుతెరచిన నవయువ్వనుడు. నా పుస్తకాలన్నీ చదివివున్నాడు, వివాహంలోనూ, గాఢ నిశ్చల, శాశ్వత, ప్రేమానుబంధంలోనూ, దాంపత్య పవిత్రతలోనూ, విశ్వాసం. తాయారును కలుసుకున్నాడు, ప్రేమించాడు. ఇద్దరికీ మిత్రుడైన నాను తెలుసు ఆమెకికూడా అతనిమీద చాలా ఇష్టమని అతనితో చెప్పకుండా నన్ను వారించింది. అతను తనకింక జీవితంలో స్త్రీ ఆమెతప్ప యెవరూ లేరని విశ్వసించాడు తను ప్రేమించిన వొస్తువులో కళంకం చూడలేనంత విశ్వాసంగల హృదయం అతనిది వారించే ప్రజలు ఆమెమీద చెప్పేవన్నీ అపనిందలన్నాడు. తనని వివాహమాడమని ప్రార్థించాడు ఒకనాటి సాయంకాలం. ఆమె తబ్బిబ్బుపడ్డది. మాట్లాడకుండా లేచిపోయింది. ఆ పెళ్ళికి ఆమె అంగీకరిస్తే ఆమె దరిద్రం, కష్టాలు, భవిష్యత్తులో భయం, లోకక్రౌర్యం, అన్నీ వొదిలిపోతాయి. అతని ఆరాధన, ప్రేమ, మర్యాద, ధనం, నిశ్చింత, ఇంకోదేశం, కొత్తప్రజలు, ఒక్కమాటతో అన్నీ తనవి అవుతాయి.

ఉత్తరం వ్రాశాడు ఆమె లేనిది బతుకలేనని. ఆ వివాహం వల్ల, అతనికి బంధువులతో విరోధం, స్నేహితుల హేళన, వెలి, సమస్తమూ, వినా పట్టుపట్టాడు, దేన్నీ లక్ష్యంచెయ్యాని మోహంలో.

ఎప్పుడైనా వాస్తవత తెలుసుకుంటే ఏమౌతాడా అని నా భయం. ఆమెను బతిమాలితే, అతన్ని నిరాకరించమనీ, వాస్తవం చెప్పివెయ్యమనీ, నేనే చెపితే ఆమెకి, ఆ సహృదయుకి, ద్రోహమా! ఆమె నోటి నుంచి జీవితానికంతా సౌఖ్యాన్ని లాగివేసినవాణ్ణి కౌతానా? వాస్తవం చెప్పకపోతే, అతనికి ద్రోహంకాదా?

నేనేమీ నిశ్చయించుకోక మునుపే, ఆమె ఆ వూరినుంచి మాయమయింది. ఒక్క మాట, ఒక్క జాడ, వదలక. "ఏ కొత్తవాడితో?" అని నవ్వుకున్నాము నీచులము. ఆమె ఆ పులం, మేము.

అతను, పాపం, అతను, ఆరాలుతీస్తో లోకయాత్ర సాగించాడు ఆమెకోసం — నెలల తరవాత కలుసుకున్నాడు. ఆమె నాయుడి యింట్లో కలిసివుండడం కూడా అతని కళ్ళని తెరవలేదు. ఆమె తనకి అతనిమీద యిష్టంలేదనీ, అతన్ని యింక తనవైపు రావొద్దనీ శాసించింది. అతను ఆమె గదిముందు వున్న లాంతరు స్తంభానికి నీడ ఐనాడు. అతనికి ఆమె తప్ప వేరే ప్రపంచం లేదు. ఆమె కిటికీపక్కన దడిగుంజగా మారాడు. కిటికీలోంచి ఆమె యొన్నడన్నా కదిలినప్పుడు కనపడుతుందేమోనని దీనంగా ఆమె నీడకోసం చూస్తో వారంరోజులు నుంచున్నాడు. ఆమె రాత్రిలు చీకట్లోంచి-అతనికి కనపడక అతనివంక చూస్తో దిండును కన్నీటతో తడిపేది.

ఇంక భరించలేక పోయింది ఆమె హృదయం. అతన్ని పిలిపించి, పక్కన కూచోపెట్టుకుని మళ్ళీ అబద్ధం చెప్పింది, తనకి అతని మీద ప్రేమలేదని ఆమెకు తెలుసు తన కన్యాత్వంలో నూన్యతంలో విశ్వాసంలో, అతనికి విశ్వాసమని. ఏ అపవాదన్నా విన్నాడా పిచ్చెత్తుతుందో ఆత్మహత్య చేసుకుంటాడో అని ఆమె భయం. అంతే కాదు ఆమె మనోనిబ్బరంలో ఆమెకే నమ్మకంలేదు. పెళ్లయిన తరవాతైనా తనకోసం పరితపించే మానవుడేవుంటే అతనిమీద కనికరించకండా ఉండగల నిబ్బరం తనకి వుండదని భయం. అతని నిర్మల విశ్వాసంముందు తన మలినచరిత్రను, తన గుండె బలహీనత్వాన్ని వొప్పుకొనే ధైర్యంలేకపోయిందో లేక అతని సుందరస్వప్నాన్ని కలతపెట్టడమే యిష్టం లేకపోయిందో! ఎవరు చెప్పగలరు? ఎవరందుకోగలరు స్త్రీ హృదయ అగాధాలని, ఆ త్యాగశిఖర ఔన్నత్యాలని! తనకి యింకోరిమీద ప్రేమ అని చెప్పి, తనని వొదిలిపెట్టి వెళ్ళమని

కన్నీళ్ళతో బతిమాలింది. అంగీకరించాడు. కాని వొదిలిపోలేన న్నాడు. అట్లానే నశిస్తానన్నాడు. ఆమె అంత దగ్గిరిగా అతన్ని బతిమాలడమూ, ఆమె చూపులూ, మాటలూ ఎట్లాగో తెలియచేస్తు న్నాయి అతనికి ఆమెకి తనమీద ప్రేమలేకపోలేదని. ఇంకా పట్టు బడితే, బతిమాలితే, ఆమె అభ్యంతరం కలుగుతుందని అతని ఆశ.

చివరికి ఆమె నిలవలేకపోయింది. అతని దీనత్వానికి ఆమె హృదయం అంత నీచమయింది. పతివ్రతల్లారా! శపించండి.

"నానించి నీకు ఏమి కావాలి?"

"నువ్వు"

"అంతేనా?"

"నీ ప్రేమ"

"ప్రేమలేదు."

"పోనీ. పెళ్ళి చేసుకో. చాలు."

"నా అందం కోసమా?"

"అవును"

"పెళ్ళి ఎందుకు! నా అందం నీది. నా దేహం నీది. ఎప్పుడు కావలసినా—"

తేరిపార చూశాడు. భూమి బద్దలయింది. మన్ను కాళ్ళకింద దించుకుపోయింది. మెల్లిగా బైటికి వచ్చాడు. ఇట్లాంటిదా? ఎంత అపాయం తప్పిందిి? అని సద్దుకున్నాడు. మూడు నెలల్లో ఒక గొప్ప షాహుకారు కూతుర్ని పెళ్ళి చేసుకుని సుఖంగా బతుకు తున్నాడు.

అమా! అతనిమీద తన ప్రేమ నంతా హృదయంలోనే మననం చేసుకొని—ఆ తీవ్రత్యాగంలో కాలి — యేమయిందో! నాకు కుత్తరాలు వ్రాయడం కూడా మానింది.

సీతలూ, దమయంతులూ, సావిత్రులూ, చేశారే త్యాగాలు! ఆ త్యాగాలు చూసి పొంగిపోర్ల బడుతున్నారు. ఉమ్మెయ్యండి ఇట్లాంటి స్త్రీలమీద. పెళ్లి అయిన ఆ వొక్కడికే భద్రంగా దాచు కుని పవిత్రతొజా సమర్పించుకుని, స్వర్గాని కెగబాకాలని చూసే పతి వ్రతలూ, నవ్వండి, వెక్కిరించండి, తరమండి దూరంగా యీ నీచ స్త్రీలని. అధికులమని కులకండి. ఆ స్వర్గమెంత నీచప్రదేశమై వుం

డాలి, ఆ దేవుడెంత క్షుద్రుడై వుండాలి, మీ వంటి వాళ్ళని చుట్టూ చేరనిచ్చి సంతోషించేందుకు?

పాపపుణ్యాలకి, శిక్షా బహుమానాల్ని యిచ్చే నరక స్వర్గాల్లో యమ దేవేంద్రులలో నమ్మకం లేకపోయినా, జీవితంలో న్యాయం జరగడం చూడకపోయినా, ఎందుకో ఆధారం ఏమీ లేకుండానే, ఈ దొంగతనాల్లోనించి, పై పై పాతివ్రత్యాల్లోంచి, స్వార్థధర్మాల లోంచి వెనకగా చూడగల శక్తిలో యెట్లాగో యెప్పుడో ఈ తప్త మృదుహృదయాలకు శాంతి నివ్వగల మహిమలో, దేంటోనో చెప్పలేని ఎరగలేని మాయా మెరుగులో, ఎందుకో నాకు విశ్వాసం పోలేదు గనక గాని; నీచులు, కులటలు రోడ్డు పక్కన దిక్కులేక చచ్చే యీ స్త్రీలలో నేను చూసిన ఔన్నత్యం—యీ పుణ్య, పవిత్ర, ప్రతిష్ఠాపూరిత సతులలో చూసిన నీచత్వం — నా హృదయాన్ని కాల్చివేసి వుండకపోనా? క్రైస్తవులె "ఈలోకంమీది, ఆ లోకం వారిది" అనే విశ్వాసంలేదు. ఈ లోకంలోనైనా గట్టిగా ఒక్కరి వేపు చెయ్యిజాచి "నేనున్నా" ననగలిగితే చాలు!

నా వ్రాతలు, చాతలు అతి ఘోరాలని వాస్తవంగా విశ్వసించే వారినిచూస్తే ఏమీ కోపం వుండదు. కాని—

"ఎంత బాగా వ్రాస్తారండీ! ఏమి style అండీ! ఏమి కవులండీ! ఏమి power అండీ!"

"చాలా మంచిపనండి! అట్లాంటి స్త్రీలకి, దిక్కుమాలిన వాళ్ళకి సహాయం చెయ్యవలశిందే. పాపం! ఆ పిల్లలేమైపొయ్యే వాళ్లో! ఈ సంఘం, అండి, యెంత మూర్ఖమండి!" అనే మిత్రుల్ని చూస్తే—యెంత ద్వేషం కలుగుతుంది!

Mealy mouthed cowards!

style! style! style ని పొగిడి, style ని ప్రోత్సహించే నా బాధని, నా బాధ వెనక మండుతో యీ సిరాలోంచి మీ హృదయాలలోకి పలకాలని చూసే మూగకంఠాల ఘోష వినబడక పోతే, మూలమూలల అణిగి నణిగి నశించే ధీరవనితల ఆర్యత్వం [illegible] తట్టకపోతే నేను వ్రాసి యేంలాభం, మీరు చదివి యేంలాభం?

style, beauty, art — ఎందుకివ్వన్నీ! దొంగ [illegible]

నీతివర్తనులనీ, ఆధ్యాత్మిక ప్రేమవేత్తలనీ, ఉన్నత ఆత్మరసికావతంసులనీ కీర్తినివ్వడానికి తప్ప!

Romain Rolland వ్రాస్తున్నాడు.

Write it simple, as simple as it's unfolding. Waste no thought upon the word & the letter, & the subtle vain researches in what the force of the artists to-day is turned to nought. You are addressing all men; use the language of all men. There are no words noble or vulgur; there is no style chaste or impure; there are only words & styles which say exactly what they have to say. Be sound & thorough in all you do; think just what you think—& feel just what you feel. Let the rythm of your heart prevail in your writings! The style is the soul.

చాలా సులభంగా 'సింపిల్'గా, ఎట్లా వెలువడితే అట్లా 'సింపిల్'గా వ్రాయి. మాటమీద మనసుని వృధాచేసుకోకు. అక్షరంపైన ఆలోచన నిలపకు. ఈ నాటి కవులు శక్తి నాజూకైన శబ్దాల, అర్ధంలేని మెలికల్లో, వెతుకుళ్లలో, మెరుగుల్లో ఇంకిపోతోంది. ప్రజలందరూ చదవడానికి వ్రాస్తున్నావు. ప్రజలందరూ మాట్లాడే భాషని వ్రాయి. గొప్పమాటలనీ, నీచపుమాటలనీ; నిర్దుష్టమైన శైలిఅనీ, మలినమైనదనీ, రెండు లేవు. చెప్పేదదో సూటిగా, స్పష్టంగా, చెప్పగల మాటా, శైలీ ఇవే వున్నాయి. చేశేది దిట్టంగా సంపూర్ణంగా తెలిశేట్టు చెప్పెయ్యి. ఏది ఆలోచిస్తున్నావో, అది సరిగా, నిజంగా ఆలోచించు. నిజంగా నువ్వు దేన్ని అనుభవించావో, అది నిజంగా అనుభవించు. నీ హృదయంలోని లయ (రిదం) నీ వ్రాతల్లో కనపడనీ ఆత్మే శైలి.

ఆ భారతిలో బ్రాహ్మణీకాన్ని విమర్శించిన ఆయన సుందరమ్మ తన భర్తకోసం స్మశానంలో యేడ్చిందంటే, హిందూ వనిత లావని చెయ్యారన్నారు. ఏ ఇంగ్లీషు ఆవిడో చేసివుంటుందిట! అవును సాధారణస్త్రీలు చెయ్యరు. సుందరమ్మలాంటి వాళ్ళు చేస్తారు.

ఏడ్చినవాళ్ళని నేనెరుగుదును. అంత వెర్రివాళ్ళని అంత reasonless absurd స్త్రీలనీ యెరుగుదును. సకృతు అంటారా! ఆ విమర్శకుడు? అవును. వేయిలో ఒకరైన యీ నిర్భాగ్యుల్ని ఏరి మీకు చూపుతున్నాను. సుఖంగా, ఏ యేడ్పూలేక భర్త చస్తోవుంటే, తాళంచెవుల కోసం, జుట్టుకోసం, యేడ్చే తొమ్మిదివందల తొంభై తొమ్మిది మందిని గురించి కాదు నేను వ్రాసేది. వారిపాలిట సంఘం, దేవుడు, భారతివిమర్శకులు, పత్రికలు, అందరూ వున్నారు. నేనెందుకు?

"స్త్రీ లోబడదు. స్త్రీస్వభావం విషయం పొరబడ్డారు" అన్నారు అయనే యింకోపట్ల.

అవును నిజం. స్త్రీ లోబడదు. మీరెరిగిన పుణ్యసతులెవరూ లోబడరు. లోబడ్డా కధకుడికీ, విమర్శకుడుకీ, యముడికీ, కన్నుకప్పి కిటికీలన్నీ మూసి లోబడుతుంది. పాపం, సుందరమ్మ దిక్కుమాలిన సుందరమ్మ - లోబడింది. అదీ వీలు లేదన్నాడు విమర్శకుడు!

ఇప్పుడైనా యీమె యీ తాయారు నిజంగా యీ దేశపు అచ్చ తెలుగు మనిషేనని నమ్ముతారా? జీవితంలో గొప్పసమయాల్లో under stress of great emotion ఏదేశంవారైనా, ఏజాతివారైనా, ప్రవర్తనలో వారి heridity, ని follow అవుతారనీ, యీ పరిస్థితులు, దేశాలూ, వేషాలూ, కులాలు, విద్య, నాగరికత, పాతివ్రత్యం యివన్నీ పైపై వ్యవహారాలనీ వొప్పుకోడం బాధ. బ్రాహ్మణీకంలో సుందరమ్మ పరపురుషుణ్ణి అంగీకరించిందంటే ప్రజలకు యిష్టంలేదు. తాయారు పరపురుషుణ్ణి నిరాకరించిందంటే యిష్టముండదు విమర్శకులకి. బాగా మనుషుల్ని మంచివారనీ, చెడ్డవారని, పతివ్రతలనీ, కులటలనీ, విడదీసి విమర్శించడం బాగా అలవాటయింది మనిషికి. వాఙ్మయంలోనూ, జీవితంలోకూడా, పాపాత్ములకి, పుణ్యాత్ములకి కొన్ని చిన్న అలవాట్లలో తప్ప యెక్కువ భేదం లేదంటే, తమశౌచానికి నిక్కి గర్వించి బోర్లపడే యీపుణ్యలోకం వొప్పుకుంటుందా? పాపాత్ములు తమకన్న అధములనుకునే తృప్తిని విడవగలరా పుణ్యులు? ధనవంతుడు భాగ్యభోగ్యాలని తనస్వంత సామర్థ్యంతో సంపాయించాననీ, యితరులకు పంచకండా తనే అనుభవించడానికి సర్వహక్కులూ, న్యాయమూవున్నాయనుకోడంలేదూ?

అట్లానే యీనీతిపరులు తమకుతప్ప యితరులకు ఆ నీతిని పంచాలంటే చాలా ఖేదపడతారు. ఖేదపడండి. అపవాదులు కల్పించండి.

అంగీకరించడానికి ఇష్టంలేనిదాన్ని ఏదో వొక కారణం వల్ల, దానితో ఖండించి, ఇష్టంలేనిదాంట్లో వుండే సత్యాన్ని లేదని తమ మనసులకూ, ఇతరులకూ చెప్పడానికి ప్రయత్నిస్తారు; మనుష్యులూ, ముఖ్యం విమర్శకులూ.

ముందు—"ఇదంతా అసత్యం"

సత్యమని తెలిస్తే,

"సత్యం ఐతేమాత్రం, వాటి సంగతి వ్రాయడమెందుకు"

చదివేవాళ్ళున్నారు గనక. ఉన్నారు చదివేవాళ్లూ ఆనందించేవాళ్లూ. ఐతే తరవాత ఎత్తు...

"ఇదంతా శైలిచేసే ఇంద్రజాలంకాదు. ఇట్లాంటివివున్నాయి."

"ఇవి మనదేశంలో కాదట పశ్చిమ దేశాల్లోవి."

పోనీలే. ఆ కథల్లో art ...

"అదంతా ఇంగ్లీషు పుస్తకాల్లోని art. ఇక్కడికి దిగుమతి చేశారు"

పోనీలే. ఎదో వొక అర్థు. ఎవరిదో వొకరిది. art వుందా అసలు?

వుంటే వుంది, లేకపోతే లేదు. అసలు విషయం వొప్పుకుంటున్నారా?

మళ్ళీ మొదటికి

"ఇదంతా అవినీతి..."

ఈ విధమైన దొంగవాదనలు కొత్తకావు. ఆ విమర్శకులను ఎన్నటికీ నమ్మించలేరు ఎవరూ... కాని ఇంకా యీ కవులమీదా, విమర్శకులమీదా అభిమానం పోని అవివేకులూ, ఇంక చీకట్లో వెతుక్కునే పత్రికా పాఠకులూ, యీ వ్రాతలలో మోసపోతున్నారు. వాళ్లకోసం దిగులు

"బాగా వ్రాస్తారు. కాని అయనే..."

"ఆయన మంచివారే కాని ఆ వ్రాతలే..."

ఏది వీలైతే అదీ.

ఆయనా వొద్దు, వ్రాతలూ వొద్దు.

ఏది సత్యం, [illegible]

...ద్దు. ఏది శీలం?

దయ, సానుభూతి, [illegible]

శరీరాలమం... [illegible]

...ండించడం మామూలే... [illegible]

...సిందాకా! అప్పుడే... [illegible]

...గతులకి కారణం... [illegible]

...తో లేచిపోయిం... [illegible]

...తో కూడా... [illegible]

ము." అని సంతో... [illegible]

"మా పురాణ స్త్రీలని [illegible]
చూడకపోతే యిన్ని కొత్తపాత్రలని [illegible]
నవీన ఆదర్శకాంతల్ని సృష్టించి ఆ పాతకాదు యీ కొత్తఆదర్శాలు
ఉత్తమమైనవి అని చూపరాదా?" అని మిత్రులు, పూర్వ పతివ్రతల
యీనాటి హక్కుదార్లు అందరూ ప్రశ్నించారు, బతిమాలారు. నా
మీద అభిమానంతో నా ధవళ కీర్తిలో యీ వొక్క మలినాన్ని తొలి
గించాలనే ఆదుర్దాతో నచ్చచెప్పాలని చూశారు.

మొదటసంగతి అపూర్వపు మనుషులనే వాళ్ళు లేరు. అంతమాత్రం
తెలిసిన వాళ్ళుగనకనే పూర్వకవులు, పురాణాల యోధులకీ, పతి
వ్రతలకీ, దేవత్వాన్ని తగిలించారు, మన నోళ్ళు మూసేందుకు.
కొందరి కొందరిలో ఒక్కొక్కగుణం అద్భుతంగా ప్రకాశిస్తుంది.
అంతే. పాత పతివ్రతల్లోని అనుకరణీయమైన ఉత్తమగుణాన్ని
మాత్రమే గాక వారిలోపాలన్నీ ఆదర్శాలనడంవల్లనే వాళ్ళని తిరిగీ
వ్రాయవలసి వచ్చింది.

ఒక్కొక్క గుణం ఆదర్శంగా చూపగల పాత్రల్ని సృష్టిం
చాను. నూతన నీతిఆదర్శాలని. పాతివ్రత్యాన్ని కిరాతులనించి,
వేషాలేనుకున్న దేవతలనించి, పవిత్రులైన ఋషులనించి, లేక రౌడీల
నించి, జమీందారులనించి, పోలీసులనించి, దుర్మార్గుడైన భర్తమీది
భక్తివల్ల, భద్రంగా దాచిపెట్టుకుందని మామూలు రకంగా వ్రాస్తేనే
గాని మీకు ఆదర్శం కనబడుతుందా? త్యాగంకింద తన శీలాన్ని
అర్పించిందని వ్రాయగల దారుఢ్యం పూర్వకవులకి వుండేది. ఈనాటి

నిస్సత్తువ నీతిక శేబరాలకి కలం ముందుకి నడవదు. నేను స్త్రీల చేత చేయించిన ధీరకార్యాలన్నీ లోకానికి పాపాలుగా కనబడతాయి కదా! ఎట్లా ఆదర్శాలు కల్పించగలను మీకు నచ్చేట్టు! తన ప్రేమ కోసం, భర్తనీ, పిల్లల్నీ, కులాన్నీ, గౌరవాన్నీ వొదిలిన స్త్రీ ఆదర్శ వ్యక్తి అంటాను నేను. ఏమైనా అఘోరత్యాగం ఆదర్శమంటాను. మీరు కాదంటారు. సీత రాత్రులు వొంటరిగా పడుకోలేక రాముడి వెంట అడివికి పోయింది. ఏమిటూ మహాత్యాగమని అడుగుతున్నాను. రావణున్ని నిరాకరించిందా? నలుగురిలో తలవొంపులనీ, పాపమని నరకంలో కాలుస్తారనీ భయమేసింది. వృత్త పిరికిమనిషి అని అంటే యేమిటి జబాబు?

అశోక వృక్షంకింది అనుభవాల తరవాత గాక, అంతకుముందు అన్నేళ్లు అడివిలో రాముడితో తిరిగేప్పుడు సీతకి సంతానం ఎందుకు లేదు? అని ఆలోచించారా?

ఓనాటిరాత్రి నేను పంతులుకి చెట్టుకింద చీకట్లో మిణుగురు పురుగుల వెలుగులో రేడియో సంగీతంకింద తాయారు కథ చెపితే_

“వోరే! ఇట్లాంటివాళ్ళు నీకే కనపడతారేంరా? ఇంత దేశం తిరిగే మాకు కనపడరేం”

అని కొంచెం అపనమ్మకం గొంతుకతో అడిగాడు. సహృదయుడు లేటనీటివంటి మనస్సువాడు, నామాటలో వేదవాక్యమంటి విశ్వాసమున్నవాడు, పంతులు. ఇంక తక్కినవాళ్ళు నమ్ముతారా! నేను నా ఆవేశాన్ని దిగమింగుకోలేక పోయినాను

“వున్నారు. నీ చుట్టూ, ప్రతి చోటా, ప్రతిరోడ్డుమీదా వున్నారు. ఆ దృష్టిలేదు నీకు! పలకరు, చెప్పుకోరు ముందుకు రారు. గాయపడ్డ నెత్తురు కారుతుందని భయం. వాళ్ళకా? అందం ఎప్పుడోపోయి వుంటుంది. హృదయ సౌకుమార్యం యీ ప్రపంచం కాళ్ళ కిందపడి యెప్పుడో నలిగి వుంటుంది. భరించలేవు వాళ్లని దగ్గిరగా! కాని ఆ మలినంలోంచీ, ఆ దీనత్వంలోంచీ ఆ మానంలోంచీ— ఎక్కిరిస్తేవా, అవిశ్వాసంతో చూశావా, గట్టిగా ప్రశ్నించావా? మాట్లాడకండా గుంపులో కలిసిపోతారు. సానుభూతిని చూపి హృదయమిచ్చావా...యిచ్చావా యివ్వగలవా? ఎంత పుణ్యపుంజం చేసినవాడివౌతావు?”

———

మా స్కూల్లో హెడ్మాస్టరుగారు వుండేవారు. ఆయన కల్చర్డు మనిషి. జీవితాన్నీ ప్రిన్సిపిల్సునీ కొంత యోచించినవాడు. నా కిదివరకే స్నేహం. మంచి హృదయం కలవాడు. నా శ్రేయస్సును కోరినవాడు. మొదట నన్ను చూసి సంఘానికీ, కులానికీ, మతానికీ, వెలిబడ్డ ఏకాకిని, ముందు ముందు నా గతి యేంకాబోతోందా, నా పిల్లల గతి యేంకాబోతోందా అని జాలిపడ్డాడు. మండిపడక జాలిపడ్డాడంటే అనేకమంది మంచి వారనే వారి కన్న నిజంగా మంచివాడన్నమాట. క్రమంగా స్కూల్లో పని పూర్తవవల్లనైతేనేం, నన్ను దగ్గరగా పరిశీలించడంవల్లనైతేనేం మెల్లిగా ఆయనకే తెలీకుండా కొంచెం ప్రపంచ విషమెక్కింది రక్తంలోకి. నా వల్ల బడి క్రమశిక్షణ పాడైపోతోందని భయంపట్టుకుంది. త్వరగా పరిచయం పురస్కరింపరని వాదనలు చేస్తున్నాడు. కొంత బోధనలు చేస్తున్నాడు. స్కూల్లో గాని, సంఘంలో గాని, అందరితో కలిసి మెలిసి పూర్వంనించీ యేర్పడ్డ పద్ధతుల ప్రకారమే గాని, నా యిష్టం వొచ్చినట్టు ప్రవర్తించకూడదని ఆయన వాదన. "గడియారంలో చక్రంవంటివాడు మనిషి—సంఘంలోనూ బళ్లోనూ" అంటాడు ఆయన. "నేను గడియారంలో చక్రాన్ని కాను, కావడానికి వొప్పుకోను. ఐనప్పటికీ యీ చక్రం తన యిష్టం వొచ్చినట్టు తిరగ తలుచుకుంది" అన్నాను.

"ఐతే గడియారం యెట్లా నడుస్తుంది?"

"బాగానే నడుస్తుంది; తక్కిన చక్రాలకి బుద్ధివుంటే సరి. అసలు యీ గడియారాన్ని చూస్తే నాకేమీ గౌరవం లేదు. దీంట్లో చక్రాలన్నీ తప్పుడు చక్రాలు- మరలు తుప్పుపట్టాయి. ఇది సరైన కాలం చూపటంలేదు. గడియారం చాలా ముసలిదయింది. సరిగా నడవటంలేదు. ఈ తప్పుడు గంటలకి అలవాటై, ఇదే సరైన కాలమంటున్నారు. ఈ గడియారాన్ని చూసుకుని, సత్యాన్ని మరిచి, కాలాన్ని కల్పించే సూర్యుడే తప్పునడకలో వున్నాడని అభిప్రాయ

పడుతున్నారు. ఒకవేళ యీ తుప్పు గడియారం ఆగినా నాకేం దిగులు లేదు. నేనూ ఆగిపోతానా? అదీ దిగులు లేదు. కాని నేను మాత్రం యిట్లానే తిరుగుతాను. చాతైనంత వరకు యితర చక్రాల్ని నాతో తిప్పుతాను. తిరగరా, యీ గడియారం ఆగడమే మంచిది" అన్నాను.

"నా యిల్లు కదా అని, తక్కిన యిళ్ళ మధ్యవున్న నీ యింటికి నిప్పంటించుకుంటే, యెవరు వూరుకుంటారు?"

"నిప్పంటించడమే కాదు నా యిల్లు బూజుగావుంది దులుపుకుంటా' నన్నా, 'ఆ బూజు మా కళ్ళలో పడుతుం'దని అరుస్తున్నారు. 'మీ యిళ్లు దులుపుకోండరా' అంటా నేను. 'నీ యిల్లూ దులుపుకోకు' అంటున్నారు మీరు."

ఆయన అపర్థం యేమిటంటే:

"ఎవరికీ కష్టం కలగచెయ్యకుండా బతకాలి." అని

తాను యేకష్టమైనా పడతాట్ట ఇతరులకి తన నించి కలగగల బాధ నించి తప్పించడానికి.

"మీ మొహం చూస్తే నాకు చాలా బాధ అనుకోండి__ అప్పుడు__?"

అప్పట్నించి నాతో మాట్లాడ్డం మానేశాడు. వొచ్చిన కర్మేమిటంటే, నేను చేసిన పనులూ వొదులుకున్న ఆచారాలూ, ఆయన మానాలని ప్రయత్నించి ధైర్యంలేక, మానినవి కనక వాటిని జయించినవాణ్ణిచూస్తే, inferior గా అనిపించింది ఆయనకి. అది భరించలేదు. 'తక్కువైనాను' అనే ఆలోచనని. గాంధీగారూ, చర్చిలూ, దేవుడూ, హిట్లరూ, తమకన్న అధికులంటే భరించగలరుగాని, బిచ్చగాడూ, పాపాత్ముడూ, గుమాస్తా, సోషలిస్టూ, స్త్రీ, కులభ్రష్టుడూ, తమకన్న అధికులైనట్టు కనపడితే_ తమ superiorityని సమర్థించుకోడానికి కారణాలు వెతుకుతారు. సంసారం వొదిలిన స్త్రీని శపించడానికి పతివ్రతలు కారణాలు వెతకడం సామాన్యమైనట్టు. కళ్ల ముందు తారలై ఆధిక్యతనుపొందిన వేశ్యల్ని అనుకరిస్తోనే వాళ్ళమీద కులస్త్రీలు పడే అసహ్యాలూ, వాళ్ల పటాల్ని దిళ్ల కింద దాచుకుంటోనే, కాలేజి కుర్రాళ్లు వాళ్లని చేసే హేళనలూ వింటే చాలు.

అందుకని మా హెడ్మాష్టరు నా principles లో ఇతరులకి కష్టం కలిగించాననే గొప్ప లోపాన్ని నాలుగు అర్ధరాత్రులు యోచించి పైకి తీశాడు. ఏమీ యోచనలేకుండా, తమ సంసారమూ, సంపాదన చూసుకుంటూ బతికేవాళ్ళకన్న, తమ స్థితినీ, అధైర్యాన్నీ, లోపాల్నీ, ఈర్ష్యలనీ, సమర్థించుకోడానికని, ఏవో principles నీ, systems నీ కల్పించి, లోకం యీ ప్రకారం జరగాలని శాశించే యీ మేధావంతులు అపాయకరమైనవారు. సంస్కారం ఎంతవరకు జరగాలో, అదే సంఘానికి క్షేమం అని హద్దులు పెడతారు...అంటే తమకి అంతవరకే ధైర్యం వుందన్నమాట.

"ముందు యీ కులాలలో శాఖలు కలిసిపోతే......"

"బ్రాహ్మలూ, కోమట్లూ, కలవవొచ్చునుగాని......"

"ఎట్లా ఐనా పదిహేనేళ్ళ లోపలే పిల్లలకి పెళ్ళి చేయాలి— ఈ ఉష్ణదేశంలో......"

"లోలకులూ, జాకెట్లూ, వొప్పుకున్నాం, కాని మరీ..."

"ఏదో స్కూలు ఫైనలుదాకానేగాని...ఆడవాళ్ళకి పై చదువులు నేను వొప్పుకోను—"

"ఆడవాళ్ళకి ప్రత్యేకం క్లబ్బులు వొప్పుకున్నాంగా......టెన్నీసు ఆడవద్దన్నామా? కాని మరీ మొగాళ్ళ క్లబ్బుల్లో......"

"నేను బాగా పరిశీలించానండీ......యీ గర్భనిరోధం వుంటే......ఏదో......"

"హరిజనుల్ని మన యింట్లో భోజనానికి కూర్చోనిచ్చినా, వాళ్ళ యింట్లో మనం......అది హైజినిక్‌గా మంచిది కాదు"

"సంఘం ఎట్లా నడిస్తే దానితో బాటు మనంకూడా"

"కాలక్రమేపీ కలియుగం ఎట్లా మారుతోవుంటోందో మనము..."

ఇప్పుడు వీరు వొప్పుకునే సంస్కారాలన్నీ ఎదిరించి ఆ సంస్కారము జరిగితే లోకం మునిగిపోతుందని విలవిలలాడిన తాతల, తండ్రుల తాతల, అమ్మమ్మల, ఆత్మలన్నీ పకపకనవ్వుతాయి.

"అవును లెండి. ఏదో బీదసాదల్ని పోషించడం మన కర్తవ్యమేననుకోండి. ధర్మశాస్త్రాలు కూడా వొప్పుకుంటున్నాయిగా! కాని ఆస్తీ డబ్బూ, భూములు, సమానంగా పంచడమంటే..."

వీళ్లని కదిలించి వాదించారా పురాతన శాస్త్రాలనుంచి, పశ్చిమఖండ వేదాంతాలనుంచి, నవీన సంస్కారాలవరకు తమకు నచ్చిన భాగాలను వీరి సాక్ష్యాలు తీసుకొస్తారు. తమ అనుభవమంటారు. తమకన్న వెనకగా ఉన్నవాళ్లు పిరికివాళ్లు తమకన్న ముందుకు వెళ్లిన వాళ్లు fools

"ఏదో పిల్లలులేని వితంతువులు, పాపం...ఏదో పెళ్లి చేసుకున్నారంటే......" అని ఒకరు.

"ఇంకా భర్తతో సంసారం చెయ్యాని పసికూన పాపం..." అని ఇంకోరు.

"ఇంకెవరూ దిక్కులేని వితంతువు......" అని మూడో వారు.

అని జాలి! ఈ దిక్కుమాలిన వాదనలు చేసే వీళ్లనిచూసి జాలి పడేవాళ్లు లేరు.

ప్రతివిషయమూ ఎట్లా జరగాలో, ఏ కూరలు మంచివో, ఏ గాలి ఆరోగ్యమో, ఏ దేశం, ఏ కాలం, ఏ రాజు, ఏ ఫిల్ము ఏసంస్కారం, ఏ సంగీతం, ఎంతవరకు మంచిదో వాళ్లది cast word. వాళ్లకి తెలీనివి లేవు

"కుర్రవాళ్లకి స్వతంత్రం వుండాలనుకోండి...కాని వాళ్లు చెడిపోతూవుంటే..."

ఇట్లా మాట్లాడే స్థితికి రావడంకన్న చెడిపోవడం ఇంకే మంచో అర్థంకాదు.

వాళ్ళ మనసుల్లో నిర్ణయించుకొన్న విలువలూ, గొప్పతనాల కన్న, వేరే వాటికి అంధులు.

ఒకసారి కొన్ని యేళ్ళ కిందట, నా చిన్నప్పటి టీచరు ఒకాయన ఒచ్చారు, నన్ను చూడ్డానికి. ఆయన్ని మాస్తే చిన్నప్పుడు నాకు చాల ప్రేమ, ఇప్పటికీ గౌరవం. నన్ను గురించి విని, నా స్థితిని తెలుసుకుని దిగులుపడ్డారు. అదే భేదం — మనని నిజంగా ప్రేమిస్తున్నవాళ్ళు, మనం అవినీతి పాలవుతున్నామన్నా, కష్టాల్లోకి పోతున్నామన్నా దిగులు పడతారు. ఎవరన్నా కోపగించారా, వాళ్లు మనమీద ప్రేమచేతకాదు, వారిమీది స్వంత ప్రేమచేత, లేకపోతే యీర్ష్య చేత. చెడిపోయిందన్న స్త్రీని యితరులు కాకు

ల్లాగు పొడిచి అదంతా నీతిమీది ప్రేమ అనుకుని తృప్తి పడతారు. ఆ కోపమంతా యీర్ష్య. పిల్లలు దుష్టులవుతున్నారని తల్లిదండ్రులు ఆగ్రహిస్తారు. అదంతా తమమీది స్వంతప్రేమ, పిల్లలమీద కాదు. తమ ప్రతిష్టకి భంగం తెస్తున్నాడనీ, తమ శాంతిని ధ్వంసంచేసి, శ్రమ కలిగిస్తున్నాడనీ. కిందపడ్డ పిల్లని పట్టేందుకు కొట్టే మాతృదేవతల్ని చూట్టంలేదా? చాలారకం ప్రేమలు గొప్పవారివికూడా అదేరకం. చాలామంది దేశభక్తుల పేట్రియాటిజం ని సైకోఎనలైజ్ చేస్తే ఎన్ని వికృతమైన ప్రోద్బలాలూ, ఉద్దేశ్యాలు బైటపడతాయో ఎవరు చెప్పగలరు.

"మీ...గారండీ, చిన్నకూతురికి పెళ్ళి చెయ్యరట. ఆడపిల్లలకి చదువు ముఖ్యమంటున్నారు. చూశారా, అంత సనాతనులు ఎంత ధైర్యంతో......" అన్నారు మునిమాణిక్యంగారు.

"ఇంతవరకు ఎవరూ విని కని యెరగని యింత గొప్ప 'డిస్కవరీని' - కట్నాలకి లోభించి చేశారేమో!"

తమని తాము మోసపుచ్చుకుని తమ ఘనతని లోకంముందు నిలబెట్టుకోడంకోసం private lectures కొట్టే scoundrels కన్న, తాము నమ్మినదానినించి కదలని సనాతనులు ఎంత Heroic sincere souls!

కాలంతో, ప్రజలతో, అందరూ ఎట్లానడిస్తే అట్లా, ఎవరికీ ఆగ్రహం కలిగించకండా, మర్యాదగా బతికేవాళ్ళతో తగాదాలేదు గాని, అదేదో చాలా తెలివైన పనిఅయినట్టు, తాము చాలా research చేసి కనిపెట్టినట్టు, అది చాలా heroic deed అయినట్టు, సంతుష్టిగా మాట్లాడేవాళ్ళంత చోరులూ, అధములూ వుండరు.

"నువ్వు ముందు ఏం కాబోతున్నావు? నీ పిల్లల గతి ఏం కాబోతోంది? పోనీ ఆ బ్రహ్మసమాజంలోనన్నా వుండకపోతివి? ఏకాకివి. సంఘబలం లేందీ మనిషి నిలవగలడా? ఈనాడు, చిన్నతనంలో, కష్టాలు లక్ష్యం లేకపోవొచ్చు. ముందు ముందు 'టూ లేట్' అయిన తరవాత విచారపడి ఏం ప్రయోజనం?" అన్నాడు.

"ఈమాటలే, కాలం గడిచినకొద్దీ నాకే తెలిసి పశ్చాత్తాపపడి తిరిగి బంధువుల్లో చేరతానని పదేళ్ళనించి వింటున్నాను," అని పరికాళం మామయ్యా. వైద్యుడు శీతారామయ్యగారు మొదలు, ఆ

నాటివరకూ, యీ గుంపునించి వేరుగా నిలవలేననీ, అవనింపల్సి, వొంటరితనాన్ని భరించలేక, సౌఖ్యంకోసం, శాంతికోసం, మర్యాద కోసం, పిల్లలకోసం, మళ్లీ యీ సంఘం కాళ్ళు పట్టుకుంటాననీ, ఎంతో ఆశించిన నేను తిరిగి తమలో చేర్తానని ఆశ పడేవారి సలహా లన్నీ యాకరువు పెట్టాను.

"కష్టాలు కలగనేలేదా? వొంటరితనం 'ఫీల్' కాలేదా?" అన్నాడు దయగా.

నా కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి. వొక్కరు దయగా పలక రించినవారు లేక, ఏకాకినై నేను గడిపిన నెలలు, ప్రతివారి మొహా నా హేళనా, అసహ్యమూ కనబడి కుంగిపోయిన దినాలు, స్నేహితు లే రహస్యాలు వెతికే కళ్ళతో నా యింటోకి భద్రంగా ప్రవేశించిన సాయంత్రాలు, ఒక్కరు హృదయం విప్పి మాట్లాడడానికి వున్నారా, యీ వర్ష రాత్రి అని వెతుక్కున్న సమయాలు! ఏమిటి, జీవిత సమ స్యకి అర్థమేమిటి, (values) విలువలుఉంటే ఎట్లా కట్టాలి? యీ బాధకి అర్థముందా లేదా అని వెతికిన అర్ధరాత్రులు!

"అవును, బాధపడ్డాను. ఆ బాధలో ఏదో సంతోషం వుంది. గుంపులో చేరాలనిమాత్రం ఎప్పుడూ ఉద్దేశ్యం రాలేదు."

"ఎందుకు యిట్లా? ఏమిటి ఆదర్శం?"

ఏం చెప్పను? నాకు తెలుసా? అదే నా ప్రశ్న. నేను దిక్కు ల్ని అడిగే సమస్య. దేవుడా? సత్యమా? ధర్మమా? అన్నిటినీ మళ్ళీ నాకు నేను కనుక్కోవాలనే నా యత్నం. ఏమీ తెలీలేదు అంత వరకు. అన్నీ సందేహాలే. ఐన నే నేం చెప్పను? తెలుసునన్న వారితో తగాదా తప్ప!

అదృష్టవంతులు మీరు.

... ... ...

వడ్డించిన విస్తరి మీ జీవితం.

... ... ...

నడతా, నాణ్యాం, విలువల విషయం.

నిశ్చల నిశ్చితాలు మీవి.

అభాగ్యలం మేము,

సరిహద్దులు దొరకని సంధ్యలలో మా సంచారం.

అన్నీ సమస్యలే, సందేహాలే మాకు.

... ... ...

ప్రశ్నలే. ప్రశ్నలే.

జవాబులు సంతృప్తి పరచవు.

... ... ...

వ్రాసుకున్నాను.

"మాశావా, ఎంతమూర్గంలో, అజ్ఞానంలో ఉన్నావో"

"కాని ఎవరు జ్ఞానులు యీ గుంపులో! ఎవరికి తెలుసు? వాళ్లనివచ్చి నన్ను నమ్మించ మనండి."

"వాళ్ల కేం పట్టింది నీ దగ్గిరికి వొచ్చేందుకు?"

"పోనీ నేను వెడతాను, వాళ్ళ దగ్గిరికి"

"అంత సులభమా! ఎన్నేళ్లు శుశ్రూష చెయ్యాలి!"

"ఏమీ? సత్యం తెలుసుకోడానికి అంత శ్రమా?"

"ఒక్క నయన్ను తెలుసుకోడానికి పదిహేనేళ్ళు చదువుతారే—"

"అప్పటిదాకా యిట్లా సందేహంలోనే వుంటాను."

"అప్పటిదాకా యీ కష్టాలు పడడమెందుకు? అందరిమల్లే"—

"ఇప్పుడు నన్ను రానిస్తారా?"

"నేను చేరుస్తాను. నువ్వు మాత్రం, ఆ జంధ్యం వేసుకుని—"

తల వూయించాను—

"ఎట్లానూ బ్రహ్మ సమాజంలో లేవుగా?"

జంధ్యం వేసుకుంటే గొప్ప ఉద్యోగాలు యిప్పిస్తానన్న బంధువుడి సంగతి చెప్పాను.

జంధ్యం కోసం నేను చేసిన త్యాగాలు మా చుట్టూ పకపకనవ్వాయి.

కులం వొదిలేశానన్న వాణ్ణిచూస్తే, కులహీనత్వంతో బాధపడేవాళ్లకే చాలా కోపం—కులంలో అధికుల మనుకునేవాళ్లమీది కోపంవల్ల, వాళ్ళు కులాలు వొదులుకుంటే సంతోషం రాదు. కులంలో వుండి ఆ కులానికి చెందడంవల్ల వాళ్లు బాధలుపడితేగాని కసితీరదు. మాతో అధికారి వుండేవాడు. అతని కులం అతనికే సందేహం. అందుకని కులం వున్నవాళ్లని చూస్తే మండిపడేవాడు. అంతేకాదు,

తన ధనాన్ని, మానాన్ని, సుఖాన్ని, త్యాగంచేసి, నీచత్వానికి లోబడి, ఆ గొప్పవుద్యోగం సంపాయించడంవల్ల, తాను త్యాగం చేసినవాటివిలువ, ప్రస్తుతం అందరి మొహానా తన ఘనత చూపించుకుని, తిరిగి ప్రతిష్టించుకోవాలని ప్రయత్నం. ఎట్లానన్నా తన పుటకనీ, past నీ మరిచి 'మరిపించి' తన శక్తి తెలిపి తనని పైకి తీసుకొచ్చాయని ప్రతివారికి చూపాలని అగచాట్లు.

'నన్ను చూడండి, నేను ... ' అని లెక్చర్లు. లోకచరిత్రలో తన ఎగపాకడంవంటి ఘనవిషయం ఎన్నడూ జరగలేదని యితరుల మీద impress చెయ్యాలని. అది గుర్తించకపోతే, తాను చెప్పినా అంగీకరించకపోతే ద్వేషం. ప్రమోషన్లు గాక వేరు విలువలున్న మనుషుల్ని చూస్తే, కసి. ఉన్నత కులాలమీద ద్వేషాన్ని పరిశీలిస్తే యీనాడు అదే తేలుతుంది. ఎంతప్రపంచం, మారినా 'ఎంత న్యూనత సంభవించినా, యీ భౌతిక విషయాలనించి అధికమైన విలువలవేపు చూస్తారనీ, ఏంచేసినా, తమ plane లోకి దిగరనే కోపం ఇంకా.

అందువల్లనే సుఃభంగా తమ దుర్గతికి యీ కులాలూ, అందులో అగ్రికులాలూ కారణమనీ, వాళ్లని కూలతోస్తేనేగాని లోకకళ్యాణం కలగదనీ వాదన. తమ బలహీనత్వమే, తమ అవసరమే, తమ క్షేమమే సుఖమే, ఒకనాడు యీ సమస్యల్ని ఏర్పరిచిందని మరిచిపోతారు. కావలిసి ఎదో మోసంచేసి ఎవరో ఆధిక్యతలోకి దూకి అన్యాయం చేశారనుకుంటారు. ఈ దేశస్థులు ఇంగ్లీషువాళ్ళనీ, స్త్రీలు పురుషుల్నీ, నిందించడానికికూడా ఇదే కారణం.

ఆ అధికారి నన్ను తీసుకవెళ్ళి, "ఈ పుస్తకం తీసుకుని రాత్రికి చదువుకోండి" అన్నాడు.

తనకి అంత మంచి taste వుందని నాకు చెప్పడంకోసం.

"ఆ కథలు చిన్నతనంలో చదివేవాణ్ణి. వాటిని ఇప్పుడు భరించలేను," అన్నాను.

రెండు నిమషాలు తేరిపారచూశాడు, తన చెవులు నిజంగా ఆ మాటల్ని విన్నాయాఅని-జన్మకి ఆరోగ్యవంతమైన ఓ అనుభవాన్ని పొందుతున్న ఆమనిషి. "మీరేం చదువుతారు ఐతే?" అన్నాడు. రొణుకుతున్న కంఠంలో.

సామాన్యంగా అందరూ చదివే బతికివున్న కొత్త ఊహాలిచ్చే నలుగురు ఇంగ్లీషు రచయితల పేర్లుచెపితే, ఎన్నడూ ఆ పేర్లన్నా వినలేదు పరిమోషనుల వ్యాపారంలో ఇరవైయేళ్ళు గడిపిన ఆ మనిషి.

"అందరూ గొప్పవాళ్లూ, దొరలుకూడా, చదువుతారు యీ కథల్ని,"

గొప్పవాళ్లూ, ఇంగ్లీషువాళ్లూ, అనే మాటలు synonyms కావని అనేది ఈనాటికి కూడా తెలుసుకోని అధికారి.

అధికారం రాగానే దాంతోపాటు సర్వజ్ఞత్వం, సకల సుగుణత్వం...సర్వశక్తిత్వం ... వొచ్చిందనే.

తనకన్న తక్కువ జీతంగలవాడు- కాయితంమీద తనని, sir, అనేవాడు, తనకన్న గొప్పవాడని భరించడం ఎంత కష్టం-

అధికారం చేతులోవున్నా, ఎంత ఆ అధికారాన్ని రుద్దినా, తమకి లోబడుతోవున్నా...

డిగ్నిటీవున్న dependant ప్రజల్ని,

తృణీకారం చూపే భార్యల్ని,

మాటపడని నౌకర్ని,

ఆధిక్యత చూపే subordinate ని చూస్తే ఎంతకార్పిర్యం! ఎంత ద్వేషం!

ఈ ద్వేషం ముఖ్యంగా unsucessful artists మీద చూపుతారు. "ఏమిటి? బొమ్మలు గీస్తాడూ? ఇంకేమీ చెయ్యకూడదూ?"

"ఎవరండీ?"

"నేను సంగీత విద్వాంసుణ్ణండి"

ప్లీడరుగారి తలకాయి కాయితాలమీదికి దిగుతుంది.

"అయితే__"

ఆ పాటకుడి అరికాలుదుమ్ము తలని ధరించడానికి తగని ఆ 'డబ్బు ఏరుళ్లగాడి' తల.

"ఎందుకండీ యీ కథలూ, పద్యాలూ- ఏం లాభమండీ-"

అని డాక్టర్లు, తమ శవాల్ని కాల్చినబూడిద! disintegrate ఐ పంచభూతాల్లో కలిసిన వెయ్యేళ్లకి లక్షలకొలది ప్రజలకి సౌందర్యానికి కళ్లుచూపే కవిని.

కాని ఏ trick వల్లనో అదృష్టంవల్లనో ఆ గాయకుడు ఆ కవి పేరుపొందాడా, ముందుగా యీ స్నేహానే, యీ డాక్టరే "మన— మనవూరి... మన కులం... నా... నాతోటి విద్యార్థి... నా మేనత్త మామగారి మనిమనమరాలి కొడుకు... ఇతను... అని చెప్పడానికి చాలా గర్వపడుతున్నాను" అని పొగడి కొంత reflected glory కోసం పెనుగులాట!

కాని ఏదో ఆదర్శాన్ని నమ్మి, artist కీర్తికాంత 'చిరునవ్వు'ని తృణీకరించాడా' యీ పొగడ్తలు ఎన్ని రాళ్ళు, ఎన్ని చీలికలు!

ఏ సహాయమూ అవసరం లేనివాళ్ళుకూడా తమ కష్టాన్ని ఇంకోరితో చెప్పుకోడం అలవాటయిన యీ దేశంలో కొంచెం కష్టముంటేదానిని గంపెడంత చేసుకుంటారు.

పై ఉత్తరం వ్రాసింది. ఏదో సహాయం కావాలని వ్రాస్తుంది. తనకి తాను సహాయం చేసుకోదు. ఏ సహాయం కావాలో తనకే తెలీదు. నేనిచ్చే సహాయం తను కోరిన రూపాన రావాలి. చాలామంది కష్టాల్లో వున్నవాళ్లు అంతే. ఉద్యోగాలు లేవంటారా? ఉద్యోగాలు లేక కాదు తాము కోరిన ఉద్యోగాలు, తమకి తగిన ఉద్యోగాలని తాము నిర్ణయించుకున్న ఉద్యోగాలు లేవని అర్థం. ఆమె కాబోగలన్నీ యిప్పుడే. నా 'సింపతీ' కోసం వ్రాస్తుంది. ఆ గోలలన్నీ వొదిలి ప్రైవేటుకి రావాలనుకుంటే సహాయం చేస్తానని ఖచ్చితంగా వ్రాస్తే ఆమెకి అర్థం కాదు. కాని బంధువుల్ని వొదిలి నన్ను నమ్మివొస్తుందా? ప్రేమా? చాలామంది స్త్రీలకి వీలైనంతవరకే ప్రేమ. ఆశ. అక్కడే ఆ బురదలోనే గొయ్యిపాతుకుని, గట్టునవున్న నాకేసి మొఖం వొంచుతుంది. అందుకో గలిగానా పరిమళాలు వెదచల్లుతుంది. అంటిదా ఆ బురదలోకి పన్నీరు కన్నీళ్లు జారుస్తుంది. కొన్నాళ్ళు యీ దాతలవలె మిణుగురులవలె ఏ స్త్రీ కష్టంలో వుంటుందా ఎవరికి నా సహాయం అవసరముంటుందా అని వెతికేవాణ్ణి. నేను ముందు శక్తిని సంపాయించాలి—ఇతరులకి సహాయం చేసేముందు. ఆత్మారాం ఒకసారి నన్ను కోప్పడ్డాడు. 'ఈ వెర్రి యోచనలలో, ఏదో యింతమంది దిక్కులేక బాధ పడుతున్నారే, అనే దిగులుతో, నీశక్తినంతా డిస్సిపేట్ dissipate చేసుకుంటున్నావు. ముందు ధనం సంపాయించు. అప్పుడు సహాయం చెయ్య

గలవు. ఇప్పుడు నీకేముంది, ఇతనికి ఇయ్యడానికి?" అన్నాడు. అది చాలా soun l advice కాని నేను ధనం సంపాయించగలనా? నా చాతనవుతుందా? ఎట్లా సంపాయించను? కొన్ని యేళ్ళకి సంపాయించాననుకో. ఈ ధనం మోతలో హృదయాల రోదన వినపడదు.

ఎంతో ధనం యివ్వడంకన్న, శ్రీమంతా సాధించడంకన్న, హృదయంలో సానుభూతి, (కనికరం కాదు, quality of mercy కూడా కాదు.) fellow feeling, పాపంలో, పశ్చాత్తాపంలో ఏకత్వం, మనసులోనించి ధైర్యమివ్వడం, 'నేనున్నాను' అన గలగడం – ఎంతో గొప్పసహాయం – స్వాతంత్ర్య భావాన్ని పెకల్చివెయ్యని అహ్వానం ఇది ఎక్కువ ఓదార్పు నిస్తాయని తిరిగి తిరిగి రూఢిపడు తోంది జీవితంలో.

అందువల్లనే,

"లోకంలోకి వెళ్ళి సహాయపడరాదా." అని భగవాన్ని అడిగితే__

"ఇక్కడ కూడా నేను సహాయ పడటంలేదని నీకెట్లా తెలుసు?" అనే జవాబులో ఎంత విలువ వుందో అనిపిస్తుంది.

"ఈ దిక్కుమాలిన స్త్రీలకు..." అనే లెక్చర్లూ—

"ఈ సంఘమనే రాక్షసి..." అని నాముందు నిప్పులుకక్కే నా admirers వాక్యాలూ – ఎంతవరకు ప్రపంచానికి ఉపయోగపడ్డాయో తెలుస్తోనేవుంది.

కాఫీ తాగుతో హోటల్లో,

"సోషలిజమే యీ లోకానికి ముక్తి. పేదవాళ్ళ ఆకలిని గుర్తించని యీ ధనికుల్ని వుంటే —"

అని సిగరెట్టులోంచి నిప్పులుకక్కే యువకుల్ని చూసి...

తిరవన్నామలై ఆలయంముందు నుంచుని, దీక్షితులుగారు

"ఈ నడుములు వొంగిన యువకులూ, యువతులూ దేవాలయాలు ధ్వంసం చేస్తారట ఆ రాతిని యెత్తమనండి" అనడం జ్ఞాపకం వొస్తోంది.

ఏం లాభం? కాని బాధపడే ప్రతి రోగితోనూ డాక్టరు ఏడిస్తే, ఏం సహాయ పడిగలడు?

మొగవాడిలో యీ weakness ని ఆడవాళ్ళు 'ఎడ్వాన్ టేజ్' తీసుకుంటారు.

చిన్నప్పుడు క—తన భర్త పెట్టే తిప్పలన్నీ చెప్పుకుని యేడ్చేది, కుర్రాణ్ణి నాతో. హాస్టలుకి వెళ్ళి, వెర్రివాణ్ణి, ఆమెకోసం రాత్రింతా ఒకటే దిగులు పడేవాణ్ణి. ఏవేవో వింత యోచనలు చేసేవాణ్ణి, ఆమెని రక్షించే మార్గాలవిషయం. అవన్నీ మర్నాడు ఆమెతో చెప్పాలని వెడితే, ఆమే కనబడేది కాదు. కనపడి కొంచెం పలకరించి వెళ్ళిపోయేది. నేనెట్లా కోపం తెప్పించానా ఆమెకి అనుకుంటూ వెళ్ళిపోతే, మళ్ళీ చీటీ వ్రాసేది రమ్మని. నా ఆలోచనలన్నీ చెపితే, అవి వొప్పుకొనేది కాదు. అవన్నీ సరైనవి కావని కొత్త ఆలోచనల్ని చేసేవాణ్ణి. కొన్నాళ్ళకిగాని నాకు అర్థం కాలేదు—ఆమెకి భర్తమీద చాలా ప్రేమ అనీ, యీ బాధలన్నీ ప్రేమలో రొమాన్సెస్ అనీ, నా సింపతీ పొందడానికే ఆ కథలు చెప్పేదనీ, నా సింపతీ ఎందుకంటే నామీద స్నేహంచేత, యిష్టంచేత. అట్లా చెప్పుకోడం ఒక విధమైన సరదా. తన గొప్ప, తను యిన్ని కష్టాల్ని భరించి కాపరం చెయ్యకలుగుతోందో - నాతో చిన్నప్పుడు ఆడుకున్న పిల్ల - తాను అప్పుడే యింత భారం వహించవలసిన యిల్లాలయిందో నాకు తెలియచెయ్యడం. నేనుమాత్రం అదంతా చాలా సీరియస్‌గా తీసుకుని ఏ త్యాగంవల్ల, ఏ హత్యవల్ల, ఏ ఎస్కేపేడ్‌వల్ల ఆమెని రక్షించగలనని ఆలోచించడం!

చాలామంది స్త్రీల గోలలు యిట్లాంటివే. బాధలు వుంటాయి కాని వాటినించి తప్పించుకునే యిష్టం వుండదు. రైళ్ళల్లో తమ రోగచిహ్నాలు చెప్పుకునేవాళ్ళు అందరి సలహాలు తీసుకుంటారు. కాని అప్పుడే తెలుస్తుంది, వాళ్ళకి ఏ సలహా అఖ్ఖర్లేదని, public sympathy కావాలి అని.

---

భూమిని, సూర్యుడు కాల్చిన స్థలాల, మానవుడు తవ్విన ప్రదేశాల, గాయాల్ని యీ కొత్త పచ్చిగడ్డి కప్పి వోదార్చింది. ఈ వానలకి ఎడారిలాగై పోయిన యీ సీమ కొత్త అందాలతో కలకల లాడుతోంది. చివరికి యీ బురద తాలూకా కూడా, ఏమీ ఆకర్షణ లేదనుకున్న భార్య ఒక రోజు ఆకుపచ్చ చీరకట్టుకుని ఎన్నడూ లేని శృంగారాన్ని ఎరువు తెచ్చుకున్నట్టుంది. అట్లా చూస్తే ఎప్పుడో వొకప్పుడు ఎట్లాగో ఓలాగు ఎక్కడో అక్కడ అందంగా కనపడని దేశమూ, స్త్రీ వుండదనుకుంటాను. సహారాలోనూ టండ్రాలలోనూ కూడా భయంకరమైన అందం వుందికదా! అట్లానే జామ్మాత్రలోనూ, తాటకిలోనూ, చిన్నమ్మలోనూ, పూతనలోనూ వుండదా? మొన్ననే ఎవరో చెపుతున్నారబ్బా, పూతన రొమ్ముమీద కృష్ణుడు కూచుని ఆడుకునే దృశ్యం చాలా కాలం మనసుని బాధించిందని!

నా వుద్యోగమూ తనిఖీలూ మరిచి, బస్సులోంచి దూకి ఆ గడ్డిలో పడుకోవాలనిపిస్తుంది. ఆ గడ్డిలో చీమలూ, పురుగులూ, అక్కడక్కడ ముళ్లూ, అడుగున బురదా, యివన్నీ ఉన్నాయని తెలీకపోలేదు ఐనా ఆ ఆశ పోదు. సౌందర్యంమీది ప్రేమ అట్లాంటిది. భర్తృహరీ, తోటి నీతిబోధకులూ ఎంత మొత్తుకుంటే యేం లాభం?—వుత్త మాంసమనీ, చర్మపు పై మెరుగనీ, రోగాలనీ, భర్తలతో తగాదాలనీ. అందమూ, సంతోషమూ, స్నేహమూ, మోహమూ, ఇట్లాంటి భావాలు ఒక రకం. త్యాగమూ, భయమూ, పాతివ్రత్యమూ, జెలసీ, దేశభక్తీ, దేవుడూ, ఇట్లాంటివి రెండోరకం. ఇవన్నీ శాస్త్రరీత్యా పరిశీలించి చూస్తే, నిజంకావనీ, కల్పితాలనీ, ఆధారం లేని సెన్టిమెంట్లనీ తెలుస్తుంది. కాని మొదటి రకం భావాలలో వాస్తవత్వం లేదని తెలుసుకుంటే జీవితం సారవిహీనం, నిష్ఫలం, దుర్భరమౌతుంది. రెండో రకం భావాలలోని అసత్యం తెలుసుకుంటే, జీవితం సౌఖ్యప్రదమౌతుంది.

కాని యీ రసాలన్నిటినీ, రెండు రకాల వాటికీ సంబంధం. వుంటే రెండూ కలిసి వుంటాయి. నాశనంచేస్తే రెండూ పోతాయి.

వేదాంతం వీటినన్నిటినీ, లోకాన్నీ కూడా కలిపి, అంతని మాయ అనే సింది_ ఇవన్నీ మాయ అనుకునే వేదాంతితో సహా. సయన్సు కూడా యీ లోకంలోని పదార్థాలని, అణువుల చేరిక అనీ, వాటి గుణాలన్నీ మనసు కల్పించే అలవాట్లనీ నిర్ణయించింది.

తర్కంవల్ల, శాస్త్రంవల్ల, విజ్ఞానాభివృద్ధికై, నిజస్వరూపాన్ని మనసులో తెలుసుకుంటారేగాని, తిండీ, చెత్తా అంతా అణువులేననీ, తన్ను మోహింపచేసిన స్త్రీ కుళ్లే మాంసమనీ, ఆ మాంసం పురుగులనీ, ఎవరూ ప్రవర్తించరు. ఆకాశమనేదీ, రంగులనేవీ, ఏమీ లేవని 'సయన్సు' ఎంత ఘోషించినా, ఏమీలేనివాటివంక చూడడం ఎందుకు అని వర్జించే మూఢుడు వుంటాడా? తేలుకుడితే, 'ఇదంతా మాయ' 'తేలు మాయ' అనే వేదాంతిని చూశారా? ఎందుకంటే ప్రపంచమంతా మాయ అయినా, అనుభవం మాయ కాదు ఆ అనుభవాన్ని కలిగించే, అందాలు, విచారాలు, అంతకన్న మాయ కావు. 'నేను' వుండడం వాస్తవమయితే, యివన్నీ వెంటనే వుంటాయి. 'నేను' లేదంటావా? అని నన్ను ఖండించడానికి నువ్వు లేవు. లేకండా పో ముందు. తరవాత విమర్శిద్దువుగాని.

ఈ సృష్టి, యీ సౌందర్యం ఎంత ఆకర్షకంగా వుంటుందో అంత బాధపెడుతుంది. మనస్సునే కాదు__ఆ బాధ నరాల్ని లాగడం feel ఫీలవుతాను. (అయ్యంకి వెంకటరమణయ్యగారు నన్ను యింగ్లీషుమాటలు వ్రాయవద్దన్నారు. వ్రాస్తే తెలుగు లిపిలో కూడా వ్రాయమన్నారు. ఈ feel అనే మాటని ఎట్లా వ్రాయమంటారో! ఇప్పుడు ఆయన పెద్ద నవ్వు పెద్ద మీసాల్లోంచి తప్పించుకొని చెవుల్లోకి చేరడం వినపడుతోంది) Walter Pater వాల్టర్ పేటర్ తాను విగ్రహాల్ని, పటాల్నీ చూస్తో ఇంకే ఆనందమూ కోరకండా జీవితం గడపవొచ్చునంటాడు. కాని ఈ అందమంతా నాకు బాధ. అందువల్లనే అందమైన ప్రదేశాలనీ మనుషుల్నీ చూడాలని వుండదు. ఈ పొలాలలో పనిచేసే కుర్రాళ్ళ కండరాలమీద ఎండ మెరిసేప్పుడు దగ్గిరికిపోయి చూస్తో నుంచోవాలనిపిస్తుంది. కాని ఆనందంవల్ల కాదు, బాధవల్ల. సైకాలజీలో బాధలో ఆనందం వుందన్నారు. పుండు చుట్టూ గోకడం లాగు. అట్లాంటిదేమో! కాదు_ బాధా, ఆనందమూ ఐక్యమౌతాయే_ యీ స్పందలు_ ఆ ఆధ్యాత్మిక

స్వరూపం యీ సౌందర్యం. కాని వాల్టర్ పేటర్, కళనించి శుద్ధ ఆనందాన్ని పొందవొచ్చునంటాడు. నా స్వభావం అతనినించి వేరో లేక నా art-sense కళాభిరుచి (రమణయ్యగారూ నన్ను చాలా తిప్పలు పెడుతున్నారు మీరు) యింకా అభివృద్ధిచెందాలో! చేతులు లేని వీనస్ విగ్రహాన్ని గంటలకొలది రోజుల కొద్దీ అట్లానే చూసి దీపం దగ్గర కీటకాలవలె విడవలేక (దీపం దగ్గర కీటకాలని చూస్తే నాకు చాలా యీర్ష్య, ఎంత ఆనందమో, ఎంత ఆకర్షణో! అంతం ఆ దీపంలోనే– ఆనందమయమైన మృత్యువులో. అట్లా స్త్రీలో మాడిపోగలిగితే! ఏమో జగత్ శ్రేయసిలో (ఊర్వశి లాకాదు, క్రిష్ణశాస్త్రిగారూ) అట్లానే భగ్గుమని లీనమైపోతామేమో!) ఆగి, చివరికి పిచ్చెక్కిన రసికులున్నారుగా. ఆ వీనస్ బొమ్మను ఆ కంఠం కిందినించి తొడలపై వరకు చూసిన కొద్దీ పిచ్చెక్కినట్లవుతుంది నాకు కూడా! ఏమిటీ బాధ అని తర్కించగా తర్కించగా సౌందర్యం లోనే ఆ గుణం వుందనిపిస్తుంది. నేను కాదు వాళ్లు దీనికి రావలి సింది. ఆ పేటరే, నా దీనికి రావాలి. సౌందర్యాన్ని, పాటలో కాని, పటంలో గాని, సృష్టిలో గాని, మనిషిలో గాని, ఆనందిస్తున్నా మంటారే, వాళ్లు ఎంతవరకు ఆనందిస్తున్నారో ఎవరికీ తెలీదు. మనం తీసుకోగలిగింది మన సంస్కారంమీద ఆధారపడివుంటుంది. ఈ రసానుభవం ఒకరిది ఇంకోరితో పోల్చి తూచి ఎక్కువ తక్కువల నిర్ణయించడానికి వీలులేనిది. ఎవరికి వారు తమ అభివృద్ధిని కొలుచు కోవలిసిందే. ఈ విషయం తెలీకనే యీ వాదనలూ, తర్కాలూ, తగాదాలూ. Tastes లో, appreciations లో, experiences లో, తగాదా లాడటమంత బుద్ధితక్కువ ఇంకోటి లేదు. కాని గొప్ప మేధావంతులే బుద్ధిమంతులే చేస్తోవుంటారు ఆ పని.

ఆనందించే గుణం హెచ్చినకొద్దీ ఒక stage లో సౌందర్యం బాధపెట్టడం ప్రారంభిస్తుంది అనిపిస్తుంది. నా అనుభవాన్ని, ఇతర కళారాధకుల అనుభవాన్ని పట్టిచూస్తే వీరి తరవాత stage లో గొప్ప ఆనందంగా మారుతుందో, అసలే సుఖ బాధలు లేకండా మాయమవుతుందో!

ఈ Life on earth యీ సౌందర్య విద్యలో నిరంతరాన్వేషణలు చేస్తోందేమో, self improvement కోసం అందువ

ల్ల నే నేమో ఏ వొస్తువులోనూ కూడా చిరమై తృప్తినిచ్చే గుణమూ లేదు, ఏ ప్రాణిలోనూ తృప్తిపడే స్తిమితమూ లేదు. ఈ లోకంలో ఏ వస్తువుకి కూడా చిరమైన తృప్తినిచ్చే గుణం లేదు. చివరికి జడత్వంలో కూడా. ఎందుకంటే యీ జడత్వం, యీ రాళ్లు, యీ మట్టి, తిరిగి తిరిగి యీ గడ్డిలోకి వచ్చి, పొంగి బద్దలై జీవితాన్ని పొందడానికి ప్రయత్నిస్తున్నట్టు (సైయిన్సు వొప్పుకోదులెండి) కనిపిస్తుంది. ఏ శక్తో ఆ గడ్డిని సృష్టించి జీవనాన్ని కల్పిస్తున్న సౌఖ్యాన్ని పొందుతున్నట్టు తోస్తుంది.

మొన్న నా ముందు గేదె పచ్చగా, నవనవలాడే గడ్డిని కరుకు కరుకుమని మేస్తోవుంటే చూస్తో కూచున్నాను. సగం తెగిన ఆ గడ్డి తీక్షణమైన బాధ నా నరాలలోనే తప్ప ఆ గడ్డికి లేదంటారా, శాకాహార గర్వాంధులారా? మృగాల కంఠాలు తెగినప్పుడు తన్నుకుంటారయే ఆ బాధంతా మీ మనస్సుల్లోనేగాని, కంఠం తెగిం తరవాత, మెదడు వేరైన తరవాత బాధ ఎట్లా వుంటుంది! మీ గొప్ప కోసం మీ అబద్ధపు ప్రచారం గాని! పైగా ఆవు చాలా సాధువు. జీవహింస చెయ్యొద్దంటారు! పిచ్చికని పట్టుకునే పిల్లిని తరుముతారు. ఈ సుందరలోకంలో యీ నవనవలాడే గడ్డినంతా ధ్వంసం చేసే యీ ఘోరఘాతుక మృగాల్ని గోవుల్ని ఎక్కడచూస్తే అక్కడ వెంటనే హత్య చెయ్యాలంటాను నేను! లోకమే హత్యామందిరం. దాంటో ఒకటి సాధువు. ఒకటి క్రూరము. ఒకటి శాకాహారి. ఒకటి మాంసాహారి. ఏమిటీ వెర్రి విభజన! అమాయకంగా భూమి అడుగున నివసించే పురుగు కుటుంబాలని అమాంతం, భర్తనించి భార్యని, తల్లినించి పిల్లని విడదీసి మింగే యీ కోళ్లని చంపాలా! చంపి రూపులేకుండా ఎముకలతో సహా, కూరవొండి నమిలి, మింగెయ్యాలా!

ముఖ్యంగా సౌందర్యంలో, యీ అశాంతిని కలిగించే శక్తి విశేషంగా వుంది. ఆలోచించగా ఏమనిపిస్తుందంటే యీ సౌందర్యాన్ని ఆకర్షకంగా చేసే సూత్రం వుందే, దాంటో సౌందర్యం నించి మనసుని, సౌందర్యాన్ని మించి, ఆ వస్తువుకి ఆ సౌందర్యాన్ని కల్పించే శక్తి దగ్గిరికి, యీ బాధద్వారా, దృష్టిని మళ్లించే ప్రయత్నం వుందేమో! ఈ జీవశక్తి మళ్లేనే మనసు కూడా నిరంతరమూ evolve ఎవాల్వ్ కావాలని యీ సృష్టి ఉద్దేశ్యం ఐ వుంటుంది.

అందువల్లనే దేనిలోనూ తృప్తిపడక, [illegible] అశాశ్వతమై ఎప్పుడూ మారే ఆశలతో, ఆరాటపడుతూ వుంటుంది మనసు. చేతికి దొరక గానే తళతళ మెరిసే నక్షత్రం కూడా పిచ్చిగాజు ముక్కగా మారుతుంది, లేకపోతే పెద్ద మంటై వేళ్లని కాలుస్తుంది. ముఖ్యం స్త్రీ సౌందర్యం. మనం పొందే, చివరికి అత్యుత్తమైన రసికుడు పొందగల, అనుభవం తరవాత కూడా- 'ఇంతే! ఇంకేం చెయ్యను?' అనే నిరాశ తోస్తుంది. ఈ నాడు [illegible]లముండక తోచదు ఆ నిరాశ. ఎందుకంటే స్త్రీ సౌందర్యం నిలవలేదు, వాళ్ల వేళ్లల్లో! నిలవకలేని నాడు తప్పదు యీ బాధ.

ఈ అసంతుష్టి, యీ అన్వేషణ, సౌందర్యాన్ని చేతికి తెచ్చుకుంటారు, తెచ్చుకుని త్వరలో వొదిలి కొత్తదానికి వెతుకుతారు- దీన్నే ప్రపంచం చంచలత్వమంటుంది - ఇది artists లో (అంటే సౌందర్యారాధకులలో) ఎక్కువగా వుంటుంది. సౌందర్యం ఎవరిని కదిలించలేదో, ఎవరికి సౌందర్యం చాలా స్వల్పవిషయమో, వాళ్లకి అర్థంకాదు కని బాధ! తక్కినవాళ్లమల్లే సుఖంగా బతకాలని, కుటుంబాలు చెయ్యాలని, ఆస్త్రీ కీర్తి సంపాయించాలని లేక కాదు. చెయ్యలేదు. లోపలి అగ్ని నిలవనీదు. ఎండమావులమల్లే పిలుస్తో తీసుకుపోతుంది- ఎండమావులని తెలిసి కూడా నడుస్తాడు కళ్లుమూసుకు ధ్యానిస్తో. వేశ్యల ముంగురులలో, మోసకత్తెల అధరామృతాలలో, తాగుడులో, పిచ్చిలో, మూఢుడై బాధ నివారణకోసం ప్రయత్నిస్తాడు. వీళ్లని, లోకపు వెలుగుకాగడాలని, వేగుచుక్కల్ని, చీలుస్తుంది, నవ్వుతుంది, తరుముతుంది, [illegible]లోకం. ఈ artists మనసులో విలువలు వేరు. ఆశలూ, స్వప్నాలూ అనంతం. ఆ గుణం వాళ్లు ఆరాధించే సౌందర్య దేవతలోనే వుంది.

కొన్ని వస్తువులు అసలు అందంగాను; కొన్ని అందవికారంగానూ ఎందుకు కనపడాలి? సౌందర్య శాస్త్రకారులు అనేక కారణాలు చెపుతారు. వాటికేంగాని- మొత్తానికి అందాన్ని మనస్సు కల్పించుకుంటోంది. మనస్సుని కూర్చినకొద్ది, ఇదివరకు కనపడని అందాల్ని చూడగలుగుతామేమో! అంతేకాదు. ఇదివరకు అందవికారంగా కనపడేవి ఇప్పుడు అందంగా కనపడడమూ, అందంగా వున్నవి, ఇంకా అందంగా కనపడడమూ సంభవించవొచ్చు. అలో

చించగా ఆలోచించగా ఒక plano ప్లేన్లో అందవికారమనేది వుండదేమో, అంతా అందమే తోస్తుందేమో. లోకమంతా అనేక విధమైన అందాలుగానే కనబడుతుందేమో అనుకుంటాను. జెర్రిని చూస్తే చాలా అసహ్యం నాకు! (తెనాలి 'జెర్రీ' నిన్ను చూస్తే కాదు. నీవు జెర్రిపి కావు Jerry వి.) భయంకూడా. కాని నా (feelings) ఫీలింగ్సునించి విడతీసి—చాలా కష్టమది— జెర్రిని విడిగా లోకంలో ఒక వస్తువుగా చూస్తే, జెర్రి గంభీరమైనది, అందమైన జీవి. కాని పూర్వజన్మనించో, నా చిన్నతనంనించో, నా పూర్వులనించో యీ భయాన్ని నా మనసు తెచ్చుకుంది. అట్లానే యీ అందాల అకర్షణ కూడా యుగయుగాలనించి నా మనసు నేర్చుకుంది క్రమక్రమంగా.

అంతేకాదు మనం దుర్మార్గం, నీచం, పాపం, అంటామే ఆ గుణాలన్నీ కూడా మంచి గుణాలేనేమో! మంచిగుణాలే, స్థలకాల భేదాలవల్ల అట్లా చెడ్డవైపోయినాయి. డబ్బుదాచుకోడం మంచిదే; పూడ్చిపెట్టడం తప్పైపోయింది. ఒక్క స్త్రీమీద కామం మంచిదే. రెండో స్త్రీమీదది చెడ్డదయింది. మనకు కలిగే లాభనష్టాలనించి గుణాల్లోని మంచి చెడ్డల్ని నిర్ణయిస్తాము. మనకి ఉపయోగపడేట్టు అబద్ధం చెపితే త్యాగం. మనకి అపకారం కలిగేట్టు నిజం చెపితే క్రూరత్వం. ఈ గుణాల విభజన మనసు నేర్చుకున్న అలవాటు. కాలమూ, దూరమూ, పెద్దా, చిన్నా, యివన్నీ మన మనసు చిన్నతనంలో నేర్చుకున్న అలవాట్లు. అవన్ని వుత్త కంటి - చేతి (eye and hand) భ్రమలంటే నమ్మడం కష్టం. ఈ అందాలూ, గుణాలూ, పుణ్యాలూ అంతే

సృష్టి సౌందర్యానికీ స్త్రీ సౌందర్యానికీ భేదాలు చెపుతారు కొందరు మిత్రులు. స్త్రీ సౌందర్యంలో వాంఛ వుంటుందిట సృష్టి సౌందర్యంలో వాంఛ వుండదుట. కాలం గడిచినకొద్దీ నాకు భేదం కనిపించడంలేదు. ఈ సౌందర్యమంతా వొక్కటే ప్రతి చోటా కన్ను కల్పించుకొంటున్న ఇంద్రజాలం; చాలా సుకుమారమైన, వాంఛనీయమైన, ఇంద్రజాలం. ఇంద్రజాలమని తెలిసినా కూడా మాయ చెదిరిపోని, ఆనందం వీడని, ఇంద్రజాలం. సౌందర్యమూ, ఆనందమూ, మాయ కావు. అందవికారమూ, అసహ్యమూ, మాయ- అన్నీ సుందరమైన వస్తువులు. వాంఛనీయమైనవి ఐ పోవాలి మన

నుకి. స్త్రీనించిగాని, దేనినించిగాని రక్తికాదు కావలసింది; ప్రతి దానిలోనూ ఆసక్తి కావాలి ఆ అభివ్యక్తి స్త్రీనించి పొందే ఆనందాన్ని ఆకాశపు నీలత్వంలోంచి, నీళ్ల చల్లదనంలోంచి, గడ్డి మెత్తదనంలోంచి, పువ్వుల మెరుగులోంచి పొందాలి. ఇవన్నీ స్త్రీ అందం అంతే ఆనందాన్ని నాకు యివ్వాలి.

స్త్రీ అందమనీ, సృష్టి అందమనీ, ఒకటి వర్జనీయమనీ, ఒకటి అంగీకారమనీ, యీ భేదాలన్నీ అల్పత్వాలు, భీరుత్వాలు, నీచబుద్ధుల నీతిభేదాలు, శాస్త్రాలు బోధించి భయపెట్టిన దౌర్భాగ్యాలు.

సృష్టి సౌందర్యంలోమాత్రం వాంఛలేదా? మబ్బులమీద పడు కోవాలని, నీళ్లమీద తేలాలని, పువ్వుల్ని కోసుకోవాలని, గడ్డిలో కూర్చోవాలని, కొండల్ని కౌగిలించుకోవాలని కోర్కె కలగలేదా? జడుడా? ఐతే, స్త్రీ రొమ్ముమీద, కన్నులోతుల్లో, తొడల నవనవల్లో నడుము సొంపుల్లో, పొట్టకింద గిమ్ములో ఏం అందాలు చూశావు? నీ మొహం!

కోర్కెలో లేదు భేదం. స్త్రీ సౌందర్యాన్ని ఉపయోగించు కోగలవు. సృష్టి సౌందర్యాన్ని ఉపయోగించుకోలేవు. అప్పటికీ పువ్వుల్ని తలలోనూ, కొప్పులకీ అలంకరించుకుంటూనే వున్నారు. కాని అవి అందక నవ్వుతాయి. అయినా స్త్రీనిమాత్రం యేం ఉపయో గించుకొని ఏం సౌఖ్యపడుతున్నారు? ఈ తృప్తి నిచ్చేది కామం గాని సౌందర్య భావం కాదు. తోటలో పువ్వు అందంవలెనే, యింటో స్త్రీ అందం నీకు అందక, నీ గోడలకి, తలుపులకి, పరదాలకి, చేతులకి, చూపులకి, సంభోగాలకి, పేరంటాలకి, వియ్యాలకి అతీతమై, దేవత్వాన్ని పొంది; నిన్ను చూసి మూర్ఖుణ్ణి చేసి నవ్వుతోంది. నువ్వు అనుభవించేది చర్మం; సౌందర్యం కాదు.

స్త్రీని పూర్తిగా తన మనికికి అనుభవంలోకి యీడ్వడంచాత గాక, చివాట్లూ, దెబ్బలూ, నీచత్వాలూ, అవమానాలూ, ఏమీ ఆమె హృదయధీరత్వాన్ని వొంపలేకపోతే, నిరాశచెంది, కసిపూని, పురుషుడు శాస్త్రాలలో కథలలో తిట్టిపోశాడు.

ఎందుకంటే, లోకాన్ని సంతాపంతో నింపే స్త్రీ స్వభావా నికి, జీవరాసుల్ని పోషించే భూస్వభావానికీ చాలా సన్నిహితం.

తొక్కి, దున్ని, మలినంచేసి భూమిని ఎంత సాధించామో, నీచపరిచి ఉపయోగించుకుని స్త్రీని అంతే సాధించగలరు.

ఎందుకంటే యీ సౌందర్యానికంతా వెనకవుండే శక్తి అంతా వొక్కటే. అది మన పెదిమలకీ అందదు, అధికారాలకీ లోబడదు! వూరికే హృదయాన్ని పిలిచి పిలిచి, అందుకోవాలని నడిచినకొద్దీ, ప్రతిధ్వనివలె దూరంగాపోయి నవ్వుతుంది. అదే యెండ మావులు, అదే ఆకాశం. అదే వెన్నెల. చుట్టూవుంది. చిక్కదు. అదే స్త్రీ ముఖంమీది చిరునవ్వు. పిల్లల వొంటిమీద కొత్తమెరుగు.

శరత్కాలపు ఆకాశంనీలం, జేష్టమాసపు వానల తరవాత గాలిలో నిర్మలత్వం, ఏదో అర్థంకాని నూతనత్వం — అదీ సౌందర్యం — ఏ కవివర్ణనలకూ, యే చిత్రకారుడి కుంచెకీ అందని అందం.

అదే స్త్రీ నల్లగుడ్డుచుట్టూ కనపడేశాంతి, అదే చిరునవ్వులో పెదిమ వొంపులోని కొంటెతనం. అదే తల్లిముఖంలో మనంచూసే తేజస్సు.

"Eyes can see only dust and earth
But feel it with your heart, it is pure joy.
The flowers of delight blossom on all sides, in every form.
But where is your heart's thread to weave them in a garland?

ఈ అందవికారం, దౌర్భాగ్యం, బాధ, అసహ్యం యివి కూడా ఆ శక్తేనేమోనని నా అనుమానం. ఎందుకంటే యీ అందమంతా మనను నేర్చుకున్న అలవాట్లుగా యీ అలవాట్లనించి మనను తప్పించుకున్నప్పుడు, యే సాధనవల్లనో యీ చిక్కులోంచి బైటపడ్డప్పుడు యీ లోకమంతా, మనుషులు, రాళ్లు, ముళ్లు పాములు, అన్నీ ఒక్కటే సౌందర్య సముద్రంగా కనబడతాయేమో! ఆ దృష్టితో ప్రపంచాన్ని ఒక్క నిమషం — ఆ Vision (దీనికి తెలుగు చేతకాలేదు, రమణయ్యగారూ) చూడాలని ప్రయత్నిస్తాను. ఒక్కడే పరమేశ్వరుడు యిన్ని రూపాలు తన లీలకోసం ధరించాడన్న ఉపనిషత్తుల ఉద్దేశ్యం జ్ఞాపకం వొస్తుంది.

అది కూడా సరికాదు. అసలు ధరించనేలేదు. ధరించినట్టు తోపిస్తున్నాడు అనిపిస్తుంది. ఎందుకంటే — వొద్దు మరీ వేదాంతం

లోకిపోయి మీకు వినుగెత్తిస్తాను. వెర్రి! ఆట! కాని అదో తమాషా? జెర్రినీ, ఆచారిని తలుచుకుంటాను - ఈశ్వరా! నీకేం తమాషా యిట్లాంటి రూపాల్ని ధరించడంకూడా నీ లీలయేనా? ఇట్లాంటి వికృతాల్ని, వికారాల్ని పొందటం నీకెట్లా యిష్టమయింది? అనుకుని చప్పున వాలిక కొరుక్కుని, 'ఇవి వికారాలు కావుగా నా మనసు కల్పిస్తున్న వికారమేగాని, అసలు యివి విశ్వసౌందర్యంలోని కిరణాలేకదా!' అని అనుకోగానే sense of humour అంత లావు పొట్ట మనిషి, ఆ గుండ్రిటి bullet head.

> పొట్టివాడే - పెద పొట్టవాడే।
> వొట్టి డబ్బాలతో - వొచ్చినాడే॥
>
> (కవి॥ కూ॥ మూ॥)

అదేం కిరణం? అని ఠకపక నవ్వు వొస్తుంది. అంతే కాదు. ఈశ్వరుడే యీ రూపాలన్నిటిని ధరిస్తే - యీ వ్యక్తుల ద్వారా యీ బాధలన్నిటిని ఎందుకు పడుతున్నాడా అని సందేహం కలుగుతుంది. కాని యీ ఆకారంలో అందవికారాలన్ని యీ కుష్టు, యీ బొర్రి, యివన్నీ లేనట్టే యీ దుర్గుణాలు, యీ యీర్ష్య, యీ మోసం, యివన్నీ లేనట్టే యివన్నీ మనసు కల్పిస్తున్న వికారాలైనట్టే, యీ బాధలూ, రోగాలూ, చావులూ, యివన్ని కూడా వాస్తవం కావేమో! అసలు లేవేమో. మనసు కల్పించుకుంటున్న మాయలేనేమో అనుకోవాలని చూస్తాను. కాని నాకు తలనొప్పి రాగానే, డొక్క వీపు కంటుకు పోయిన ముష్టిది, వాలిక వేళ్లాడేసుకుని చస్తున్న కుక్క, చచ్చిన కొడుకోసం యేడ్చే ముసలిది, నీరు లేక తల వేళ్లాడేసిన తోటకూర మొక్క, సగం దేహం తెగి యింకా మూలకి పాకే వానపాము, నా కంటపడగానే - యిదంతా కూడా మాయా? అని నన్నూ, నావంటి మాయావాదుల్నీ చెప్పుతీసుకొని తన్నాలనిపిస్తుంది.

> పాలికాపు నుదుటి చెమట.
> కూలిదాని గుండె చెరువు.
> బిచ్చగాడి కడుపు కరువు.
> మాయంటావా? అంతా
> మిథ్యంటావా?

నా ముద్దుల వేదాంతీ
ఏమంటావు?

(శ్రీ. శ్రీ)

మన సౌఖ్యాలు, అందాలూ, అన్నీ మనసు కల్పించిన మాయ లేకానీ, వొస్తువులూ ప్రపంచం మాయేకానీ, అనుభవం - మాయ కాదు కదా? సుఖపడడం మాయ ఐనా, బాధపడమనేది మాయకాదు.

"జమీందారు ఫోర్డుకారు
మహారాజు మనీపర్సు"
మాయ ఐనా,
"తుపానులు భూకంపం"
మాయ కావు.

చావు మాయకాదు. శాశ్వత జీవనం అనేది వున్నా, చావు తరవాత యెక్కడో మిగిలినా, చావు మాయే ఐనా, మన మిత్రుడు కనపడకండా పోవడం, మన మాటకి జబాబు చెప్పకపోవడం, ప్రతి సాయంత్రం 'టీ' దగ్గిర జ్ఞాపకంవొచ్చి దిగుళ్ళలోకి నెట్టడం, కొత్త కథ విని సంతోషించడానికి లేకపోవడం మాయ కాదు కదా!

అనుభవం క్షణికమే, fleeting, inpermanent, అశాశ్వతం. కాని బతుకే క్షణాల అనుభవాలమీద ఆధారపడ్డప్పుడు - అవి తప్ప గతిలేనప్పుడు, శాశ్వతమనేది వేదాంతుల వాదనల్లో, కవుల కలలలో తప్ప ఎక్కడా కనపడనప్పుడు - ఇంకేంగతి?

డబ్బు అంటే దమ్మిడీలే కదా - ఏం గొప్ప! అన్నట్టుంది. ముష్టి అతనికి ఆ దమ్మిడీలే గొప్ప!

క్షణాలనే నమ్మి, పరిగెత్తి పోయే స్వల్ప ఆనందాలతోనే సుఖపడదాము. ఎదో వొరుగుతుందని నమ్మి మాడి చావనీ వేదాంతుల్ని - నేనూ ఆచారి, ఒకటే శక్తిలోని భాగాలా? వొప్పుకోను. అదే నిజమైతే—నేను అబద్ధంలోనే బతుకుతాను. ఈ ఆచారే ఈశ్వరుడైతే, నేను సైతానుగానే వుంటాను.

---

రామనామకే దో అక్షర మే
సబ సుఖ శాంతి సమాయీ !!

అని (K C Dey) కే. సి. డే. పాడుతున్నాడు గ్రామఫోనులో. K. C. Dey రికార్డులు ప్రతి వాళ్ళకీ అమ్మకూడదని ఒక శాసనం వుంటే బాగుండును! డెమోక్రసీ, ప్రజలందరికీ కళలు, ఆనందం, కమ్యూనిజం - తారతమ్యం లేకుండా అనుభవం- అంటాము. భాగ్యాలూ, భోగాలూ, పంచుతాము కాని విలువగల కళాపదార్థాల నించి ఆనందం పొందగల సంస్కారాన్ని యెవరు పంచగలరు ? ఇది ఉత్తమ విద్యవల్ల, సాధనవల్ల, వాతావరణంవల్ల మనసులో కలిగించగలిగిన మార్పు కాదు. లక్ష్మీబాయి సంగీతాన్ని కాఫీహోటలు రేడియో, దుమ్ము రోడ్లమీద, మాధాకవళం వాళ్ళ నోళ్ళల్లో, మోటారు రొదల్లో, వేడి మసాలా వడల అరుపుల్లో, పందుల గురగురలతో కలిపి వెదజల్లుతో వుంటే యేడుపు వస్తుంది. అమూల్యమైన సంగీతం ఎంతో కష్టపడితే నేకాని లభించని కళానుభవం ఎంత చులకనై పోయింది? తెల్లారకట్ల జట్కా బండీ వాడు ఒంటరితనాన్ని తప్పించుకోడానికి "క్యా కారన్ హై అబ్ రోనేకా" అని అరుస్తాడు.

కే. సి. డే,

'రామనామకే దో అక్షర మే' అని చక్కగా బతిమాలుతున్నట్లు పాడితే రామనామంలో నాకుకూడా ఉత్సాహం కలుగుతున్నట్టు అనిపిస్తుంది. ఇక దీక్షితులుగారికి ఎట్లా వుంటుందో? దీక్షితులుగారూ- D L రాయి 'సీత' చదివారా? అసలు రామాయణం అంతా "రామ" అనే శబ్దంలోంచే పుట్టిందేమో అనుకుంటాను. ఈ "రామ" అనే శబ్దానికి మంత్రశాస్త్రంలో గొప్ప విలువ ఉంది. ఆ పదంమీద సాధారణ ప్రజలకు ప్రేమ కలగడానికనే ఆ రామాయణ కథ కలిపించారో, కాక ఆ పేరున్న యే రాజు కథో జంట చేశారో! "రామ" అనే పదం నిజంగా "సబ సుఖ శాంతి సమాయీ" కావచ్చు. శరీరంమీద, మనసుమీద నరాలమీద ఆ sound కి Influence అధి

కారం ఉండి వుండవచ్చునేమో! దానికి emotional quality ని యిచ్చేందుకై ఆ కథంతా వ్రాశారేమో!

మిత్రుడు తారానాథ్ గారిని చూడడానికి తుంగభద్ర వెళ్ళినప్పుడు అక్కడ ఒక కన్నడ జ్యోతిష పండితుడున్నాడు. నేను రైలుదిగి వెళ్ళినప్పుడు సుమిత్రా గారికి జ్యోతిషంలో పాఠాలు చెప్పుతున్నారు.

నన్ను చూడగానే తారానాథ్ గారు "టీ వస్తుంది. యీలోపల - ఆంధ్రులు వీరు. ఈయన జాతకం ఎట్లా నడవబోతోందో నాకు తెలిసికోవాలని ఉంది" అన్నారు.

నా జాతక చక్రం వేసి ఆయనముందు ఆమెని దానిమీద ప్రశ్నలు వేయడం ప్రారంభించారు. "ఈ గ్రహాలకూటమి యేమి తెలియజేస్తోంది."

ఆమె చెప్పలేదు. "Count చేసే లెక్కకువచ్చే జాతక చక్రాలు రెండురకాలు — శ్రీరాముడి చక్రం, శ్రీకృష్ణుడి చక్రం." చూడండి -

"ఈ జాతకుడి చక్రం దేనిమల్లే వుంది?"

"కనబడుతోంది - అది శ్రీరాముడి చక్రం. అంటే జీవితమంతా కష్టాలు."

ఇది శ్రీరాముడితో పోలిక వచ్చినందుకు ఫలితం.

"ఆదర్శాలూ, వాటికై యత్నం. ఆ మూలంగా తెచ్చిపెట్టుకున్న అశాంతీ. బాధలూ సంఘద్వేషం అపవాదులూ - యీ జాతకుడికి ఎన్నడూ సౌఖ్యమనేది సున్న. భోగాలు ఉండనీ, లేకపోనీ, వాటివల్ల సౌఖ్యం రాదు. దృష్టి ఆదర్శాలవైపు - అశాంతి - బాధ" అన్నాడు.

నా సంగతి యేమయితేనేం? శ్రీరాముడి సంగతి మాత్రం నిజమే పాపం!

"ఇంక కృష్ణుడి చక్రం - అన్నీ భోగాలు, అంతా లీల." నిజమే కృష్ణుడి దగ్గర ఎవరూ వేదాంతం మాట్లాడరు, అందరూ స్తుతులూ, యాచనలూ -

"వేదపురుషుడివి నీకు తెలీందేముంది!" అని చల్లగా తప్పుకుంటారు. ప్రతి వాడికీ, ప్రతి రుషికీ, కోతికీ, బైరాగికీ రాముడు

లోకువ. ప్రతి వాడూ, యోగమూ, ధర్మమూ, వైరాగ్యమూ, మాట్లాడే వాడే, బోధించేవాడే. పైగా ధర్మాలు వెలిగే యుగంలో స్వయంగా విష్ణులో ముప్పాతిక అంశలో పుట్టాట్ట శ్రీరాముడు. ఆయనకి యీ బోధనల అవసరమేమిటో! శ్రీరాముడికీ, ధర్మరాజుకీ, ఎవరు బోధించినా చచ్చేదాకా కూడా జ్ఞానం వొచ్చినట్లు లేదు. చివరదాకా బోధిస్తూనే వున్నారు. అన్ని పాపాలూ చేసిన అల్లరి కృష్ణుడికి చెప్పడానికి ఎవరికీ గుండెలు లేవు. పైగా ప్రపంచానికి అతనే భగవద్గీత బోధించాడు. శ్రీకృష్ణుడు ప్రపంచ వాఙ్మయంలో ఆకర్షకమైన పాత్రలలో ముఖ్యుడు పిల్లల కొంటెతనాలకి, చిన్నతనంలో వుండే అందానికి, సంతోషానికి, ఉత్సాహానికి ఆదర్శం. బృందావనం, యమునాతీరం, గోపికలు, వేణుగానం, రాసనృత్యం - అంతా అలంకారం, ఆనందం. ఒక్కదినం కృష్ణుడితో బృందావనంలో గడిపే అదృష్టానికి తన సాహిత్య ప్రాధాన్యాన్ని వొదులుకుంటానన్నాడు టాగూరు.

పిల్లల అల్లరి ఆసక్తికి, యవ్వనుల శృంగారానికి ఎన్ని కలాలు కదుపుతాయి అతని కథలు!

అతను రసికావతంసుడు. ప్రేమలో మోహంలో, మాధుర్యం, తీవ్రత, లీల, శృంగారం___ఎంత వుందో అంతా చిరకాలం నించి కవులు తమ భావ వీధుల్లో అందుకో కలిగిందంతా శ్రీకృష్ణుడి మీద వర్షించారు.

అట్లాంటి వ్యభిచారిచేత (అస్ఖలిత బ్రహ్మచారి చేత) ఉపనిషత్సారం అనుకుని సన్యాసులు పూజించే భగవద్గీతని చెప్పించడంలో వున్న రహస్యాన్ని సత్యాన్ని ఎవరన్నా గమనించారా?

సౌరిస్ అంటోందిగదా "ఆ రాముడికి ప్రతిసారీ ఎవరో ఒకరు 'నువ్వు మనిషివికావు దేవుడివి; నువ్వు మనిషివి కావు విష్ణువి' అని యెప్పుడూ జ్ఞాపకం చేయవలసిందేకదా! అంత చెప్పినా తెలివి రాదు. పైగా కృష్ణుడు తానే చెప్పుకుంటాడు మాటికిముందు తానే భగవంతుణ్ణని."

"వినయం, వినయం," అని బళ్ళల్లో గుళ్ళల్లో బోధిస్తారుగాని "[illegible] వెధవనీ" అంటే లోకం [illegible]డా "అవును నువ్వు వెధవ్వే" అంటోంది. తనప్రజ్ఞ తాను చాటుకొన్నవాణ్ణే లోకం విలువచేస్తుంది;

కావలిస్తే నవకవుల్ని సన్మానించినప్పుడు వాళ్లు రేపల్లెలో యిచ్చిన ఉపన్యాసాలు సాక్ష్యం.

అసలు రాముడు తెలివితక్కువవాడు. చిన్నప్పుడు చందమామ కోసం యేడవడంబట్టి తెలుసుకోవచ్చు అతను idiot యిడియెట్ అని. యేమన్నా సందేహంవుంటే అద్దంలో చందమామను చూచి సంతుష్టి పడ్డాడన్న సంగతి చదవగానే congenital idiot అని నిశ్చయమవుతుంది.

అందుమూలానే ప్రతివాడికీ చులకన - తండ్రికి, సవతితల్లికి, రావణుడికి, మారీచుడికి, విభీషణుడికి, సుగ్రీవుడికి, వసిష్ఠుడికి, చాకలాడికి, వాచకాలు రాశేవాళ్ళకి కూడా. రాముడి తెలివి చూపించడానికి చంద్రుడూ - అద్దం పాఠం వ్రాస్తారు-పిల్లలకు ఆదర్శంగా

రాముణ్ణీ, కాసబియాంకానీ, ధర్మరాజునీ, ఆదర్శంగాచూపే ఈ టీచర్లూ, వాచక కారులూ, బడులూ యివి తలుచుకుంటే యెంత 'వొద్దు నీకెందుకు వాటిజోలి?' అని వివేకం చెప్పుకున్నా నా కలం పరిగెత్తుతుంది - స్వాధీనం తప్పి. ఈ రాముణ్ణి కృష్ణుణ్ణి వొదిలి బడుల విషయాలతో నా దినచర్య ఘోరాలతో యీ పేజీలు నింపెయ్యాలని చూస్తుంది. ఎవరికి వుపకారం, నాకు అపకారం తప్ప యీ రోదన! మలేరియా, వివాహం, క్షయ, దారిద్రం, కుష్టు కల్పించిన శక్తులే మానవజాతికి యీ విద్యావిధానాన్నీ వివాహ సంస్కారాన్నీ కటాక్షించినాయి.

"విద్యావిహీనః పశుః" అన్నమాట మమ్మాటికీ నిజం. పశువులకున్న శాంతీ, నిర్మలత్వమూ, జీవితంలో adjustment నీ,మనుషుల్లో చంపేశింది విద్య. పశువుకన్న హీనం చేసింది మనుషుల్ని. ఆరోగ్యం, ఆత్మవికాసం, సంతోషం, జీవితంమీద ప్రేమ అన్నీ నశించాయి. సమస్తలోకాల్నీ ప్రియుడిగా చూసి పట్టలేని తన ఆనందాన్ని నిర్భాగ్యులకు పంచాలని చూడవలసిన పతివ్రతలూ, వివాహ మంత్రాన్ని ఆశ్రయించుకొని జలసీ, చీదరా, తగాదాలు, కోపం, కాపీనం వీటితో ఎట్లా కుళ్లుతున్నారో, అట్లానే యీ లోకాన్ని అర్థం చేసుకొని, జీవితాన్ని స్వయం చేసుకొని జ్ఞానతృష్ణని సంతుష్టి పరుచుకోడానికి సహాయపడవలసిన విద్య, విద్యావంతుల్ని

యే సామరస్యమూ లేక సంఘంతో, భార్యలతో, సృష్టితో, తమ వాంఛలతో మెలిగే విధం తెలియక నశించేవారినిగా చేసింది.

The spectores of famine, of the plague of war etc., are mild and gracious symbols compared with that menacing figure, Universal Education, with which we are threatened, which has already eunuched the genious of the last five and twenty years of the nineteenth century, and produced a limitless abortion in that of future time. Education, I tremble before thy dreaded (sacred too) name The cruelties of Nero of Caligula what were they ? - a few crunched limbs in the amphitheatre ; But there : O Education, are the yearning of souls sick of life, maddening discontent, all the fear-some and fathomless sufferings of the mind.

GEORGE MOORE.

అంటున్నాడు జార్జిమూరు. అతనివెంట బళ్లల్లో తాముపడ్డ కష్టాల్ని, యీ విద్య చేసేఅపకారాల్ని గోలపెట్టి వినిపించారు లోకానికి, world thinkers, టాల్‌స్టాయ్, బెర్నార్డ్‌షా, బెర్ట్రెండు రస్సెల్, ఎథెల్ మానెన్, మొదలైనవాళ్లు.

"పిల్లలు బాధలు పడుతున్నారా బళ్ళల్లో! యీ విద్యవల్ల నష్టాలు కనబడవే!" అనేవాళ్లు లక్ష. కాని సుఖరోగాలు సర్వ సాధారణం కావడంవల్ల ప్రజలు నిర్లక్ష్యంగా తిరగడంవల్ల, వాటి బాధ, వాటి అపకారం తక్కువయిందా? అందరూ విద్యను తిట్టే వారే. ఎవరూ మానుకోరు, మార్చరు. పైకి తిట్లే కాని లోపల అందరికీ నమ్మకమే - విద్యలో. నా హృదయంలో దిన దినమూ మండే యీ తపనను ఎట్లా తెలియచెయ్యను? ఈ బళ్లు, ఆ చీకటి, మురికి, దుమ్ము, ఆ టీచర్లు, బెత్తాలు, ఆ పాఠాలు, వాచకాలు, ఆ సన్నని బల్లలు, ఆ వాసనలు - ఆ శుష్క పాఠక్రమాలూ, - ఎన్నటికి విముక్తి! రోగాన్ని, బాధల్ని, బీదరికాన్ని, evils ఈవిల్స్ అని తిడతాము. విద్య, పాతివ్రత్యము మొదలైన ఘోరాలు పవిత్రపు పట్టుశాలువలు కప్పుకొని నిర్భయంగా సంచరిస్తున్నాయి మన మధ్య.

పిల్లల్ని బడికి పంపడం - పిల్లల క్షేమానికికాదు అనేవాడికి పిచ్చి పట్టిందనుకుంటారు. మొగపిల్లలకి చదువు, ఆడపిల్లలకి పెళ్లి - యీ రెండూ పెద్దవారి callousness, stupidity,

helplessness. స్వచ్ఛంగా కనపరుస్తున్నాయి. పిల్లల స్వభావంలో విశ్వాసంలేక, వాళ్ల పొగరు అణచడానికి, castigate చేసేందుకు, యీ గిత్తల్నీ, పెయ్యల్నీ, పొగరణిచి, గుమాస్తాలనీ, వంటవాళ్లనీగా చేసేందుకు ఏర్పరిచిన, వికృతరాక్షస సంస్థలు. బతికివున్న పిల్లల్ని, సరికి, వొండి, డబ్బాలలో పెట్టి, మూసి, సీళ్లువేసి, B. A. లు అనీ, ధర్మపత్నులనీ, చీట్లు అంటించి, కొంచెంగా ప్రాణంపోసి, ఎగుమతీచేసే యంత్రివర్గకులు. మళ్లీ తమ ఇంటికిరాకండా, తమ డబ్బు ఖర్చుచెయ్యకండా తమకి అపకీర్తి రాకండా, బడికీ, అత్త వారింటికీ పంపేసి శాంతిపడే సౌకర్యాలు.

పుట్టింది మొదలు ఆపిల్ల ఎట్లా వొదులుతుందా అనే ధ్యానం.

పిల్లలు - వృత్తి పెస్తురు, ఎదిగే యొముకలు. ఆతురతతో, విశ్వాసంతో నిండిన చూపులు, ముద్దుమాటలూ, అర్థంలేని అల్లరీ, నిష్కపటమైన మనసులూ - చవక, అతిచవక - పిల్లచవ్వే పిల్లను కనటం సులభం. పురుగులమల్లే లోకమంతా పిల్లలు - ఎన్నికోట్లు- ఏమైతేనేం - బాధ యేమిటో, ఎందుకు కలుగుతోందో తెలిసికోలేని పాపలు, బలవం పట్టుకొని, తలవొంచుకొని ఐదుగంటలు - ఒక వంకర గీత మీద అట్లా రుద్దుతూ, ఒక్క అక్షరాలేమిటో సమస్తమునూ,- టీచర్ల ప్రశ్నలూ, యీ దరిద్రిగొట్టు యినస్పెక్టర్ల తనిఖీలూ - అంత వప్పరాకపోతే యీ కోపమే దహించకపోతే - యేముద్దును.

ఒక్క హృదయమన్నా కదిలిందా? కదలదు. కదిలిందో......

"ఏమి స్టయిలండీ?" అంటారు-

Style. ఏమి Style! నా మొహం Style! మిమ్మల్ని కదిలించింది నా మాటలు కావు, నా మాటలలోని వాస్తవత. పసిపిల్లల పిచ్చి చూపులు నా హృదయంలో పుట్టించిన బాధ - లక్షల కొలదీ దిక్కుమాలిన పిల్లలు, దరిద్రపు బళ్ళలో దినదినము, గంటగంటా పడుతున్న దిక్కుమాలిన నోరులేని వేదన!

ఎదిరించాడా, చదువు వొద్దన్నాడా, గురువు, తండ్రి, సంఘం.

"వెధవ! చదువురాని వెధవ!! బండ!!! ఎందుకూ పనికిరాని మొద్దు!"

బడి అనే వికృతపు మరలో పెట్టి వంకర్లుగా నొక్కుతో వుంటే వదని తిరగబడే ధీరుణ్ణి...

“నీకోసమేరా! నీ మంచి కోసమేరా!” ఆ తన్నులు, ఆ కోపం_ ఆ పుస్తకాలు, ఆ చచ్చు నీతులు, ఆ మురికి పలకలు అన్నీ-

“సుఖంగా ఆడుకుంటాను ఈ ఆనందమయమైన ప్రపంచంలో. ఆ మురికి గూడులోకి, ఆ టీచెరు పెనుభూతం దగ్గిరికి పోను”_ అని యేడ్చే కుర్రవాళ్ళని పెద్ద పట్టణాల్లో, నెల్లూరులో, గుడివాడలో _ యీ 1938 లో కాళ్లు చేతులు కట్టి, పందిని పొడిచి కర్రను కట్టి లాక్కుపోయినట్టు మోసుకుపోవడం చూశాను. పండు వెన్నెట్లో చక్కని సాయంత్రాలు, ట్యూషన్లని అరుగులమీద చంటిపిల్లల్ని బంధించి మొట్టికాయలు మొట్టడం చూశాను. వీధిలో పోయే బళ్ళనీ, ఆడుకొనే పిల్లల్నీ చూసి ఆకళ్ళల్లో కలలు కలిగితే పాఠం మరిచిందని దెబ్బలు. అకాత్తుగా టీచర్లందరూ, ముఖ్యం ట్రైనింగు స్కూళ్ల టీచర్లు అందరూ భస్మమై ఈ లోకంనుంచి వొడలిపోతే! పైగా ఈ నరకబాధలలో చాతుర్యాలు, నడకలు, art, steps విధానాలు. సినీమాలో _ మనిషిని బలికి తయారు చేసే steps - జ్ఞాపకం వొస్తాయి. ఆ కథలో ఎవరో వొచ్చి చివరికి రక్షిస్తారు. కాని యీ బళ్లలోంచి యీ దిక్కుమాలిన బలి పిల్లల్ని రక్షించేందుకు ఏ దేవుడూ రాడు. ఇంతా చంపి చదివించి _ యెందుకు చివరికి?

“చదవండి. చదవండి. జ్ఞానం సంపాదించండి. విద్యని కీర్తించండి.” ఎందుకూ? అన్నీ Vested interests. రాజకీయం వాళ్ళకి, తమ అభిప్రాయాలు ప్రచారం చేసుకోడానికి, మందులవాళ్లు తమ మందు ఘనత చదివించడానికి _ టీచరు బతకడానికి, యినస్పెక్టరు తన జీతానికి, పుస్తకాలు వ్రాసేవాళ్ల అమ్మకాలకి, ఆఫీసుల్లో చాకిరీలకి _ చదవండి, చదవండి. చదువు. చాలామంచిది. ఈ మంచి బోధనలంత అపాయకరమైనవి, “మీ బాగుకోసమే” అనేటంత మోసం యింకేంలేదు లోకంలో.

“ఎందరు పిల్లలు?” అని యినస్పెక్టరు ప్రశ్న.

“ఎనిమిదిమంది ఎక్కువైనారు”

“బావుంది! ఏవీ ఎన్ని పాఠాలు చెప్పావు? ఎన్ని వొచ్చు వీళ్లకు? బావుంది”

అంతేకాని-

"ఎన్ని శాస్త్రాలు విరిగాయి? ఎంతమంది పిల్లలు యేడ్చారు? ఎన్ని వేళ్ళు పోయినాయి? ఎంతమందికి ఆనందం శాశ్వతంగా వచ్చింది?"

ఈ లెఖ్ఖలు, యీ Statistics ఎవరూ అడగరు.

బాగ్రిఫీలూ, వేమన పద్యాలూ వుంటేనేగాని విద్యకాదనే గుడ్డితనం వొదిలి అభివృద్ధి పొందాలని నిశ్చయించుకుంటేనేకాని, యీ ప్రపంచపు తీరుని దిద్దితే యీ బాధలు కొంతవరకన్నా తొలగి పోతాయి అనే విశ్వాసం ఉంటేకాని యెట్లా సంస్కరించగలం?

విద్య ఆనందాన్ని వృద్ధిచేసేందుకు, బాధని తప్పించేందుకూ ఉపయోగపడాలి. ఎందుకు జ్ఞానం? ఆనందాన్ని యివ్వని జ్ఞానం, మనోశరీరాల సౌఖ్యం చంపే జ్ఞానం యెందుకు? యెందుకంటే, యేదిగాని, యే అభిప్రాయంగాని, యే పనులుగాని యీ లోకమంతా మన పంచేంద్రియములద్వారా, బాధ సౌఖ్యమూ అనే రెండు ద్వారాలనే record అవుతోంది. ఆ విలువలు తప్పితే జీవికి వేరే విలువలు లేవు. ultimate గా చూస్తే బాధని తగ్గించి, ఆనందాన్ని వృద్ధి చెయ్యని విధానాలన్నీ మనుష్యజాతికి శల్యవులు. ఈ విరోధాలైన సంస్థలు విధానాలు ఎందుకు నిలిచిఉన్నాయి యింకా? అంటే సామాన్యప్రజలు మూర్ఖులు. తెలిసిన కొద్దిమందీ స్వార్థపరులు.

"ఏం చేస్తావురా? చదువుకోక అడుక్కుతింటావా?" అని తండ్రి అడిగితే-

ఆ బిచ్చగాడి స్వేచ్ఛ తలుచుకొని నిజంగా బిచ్చమెత్తుకో నిస్తాడా? అని కడుపు తరుక్కుపోతుంది - కుర్రాడికి; "ఇంట్లోంచి, పో" అని భర్తఅంటే, నిజంగా పోనిస్తాడా అని ఆశపడి చూసే భార్య మనసులాగ.

విద్యావిధానాన్ని సంస్కరిస్తారట! మనిషి స్వభావంలో విశ్వాసంలేని మనుష్యులు ఆనందానికి మనిషికి హక్కువుందని అంగీకరించని మహాత్ములు, రోజుకు ఎనిమిది గంటలైనా మనిషి పనిచేస్తేనే గాని సరియైన మార్గంలో నడవడని సందేహపడేవాళ్ళు విద్యను సంస్కరిస్తారట?

ఆనందం మనిషి హక్కు. ఈ నవనాగరికతవల్ల ఆనందాన్ని నాశనంచేసే చదువులు, నడుములు విరిచేపనులూ యీ అనర్థం తెచ్చి పెట్టుకున్నాం. యీ ఆస్తి హక్కులు, ఈ పురాతన అభిప్రాయాలూ తెల్సిలూ, నాయకుల జ్ఞానంమీదా మంచితనంమీదా ఆధారపడతారు. ఆ నాయకులు స్వార్థపరులు. ప్రజలని మోసగించి తమ్మ తాము మోసగించుకొని పనీ, శ్రమా అంతా ప్రజల విరిగే వెన్నులమీద పారేసి తాము సుఖంగా కాలక్షేపం చెయ్యాలని చూస్తున్నారు.

విద్య అంటే ఆనందించే శక్తిని వృద్ధిచెయ్యడం. సౌందర్యా లకి కళ్లు తెరవడం. బాధల్నించి, కష్టాలనించి తప్పించుకునే నేర్పు నివ్వడం, ఇతరుల స్వేచ్ఛన్ని అడ్డగించే స్వార్థపరత్వంనించి, అంతా తనకే కావాలని దాచుకునే కాఠీనంనించి, భయాలనించి తప్పించడం. మనిషి సుఖపడడానికి పుట్టాడు. ఆనందం అతని జన్మహక్కు - అనే నమ్మకం ఎవరికీ లేదు - తిండీ, గుడ్డా అతని జన్మహక్కు అనే వాళ్ళకి కూడా - ఆస్తీ, బాంకిలో డబ్బూ, ఎవరి హక్కూ కావనే వాళ్లకి కూడా.

ఈ సోమరి భాగ్యవంతులచేత పనిచేయించాలని కాదు - ఆశయం.

ఈ కష్టపడేవాళ్లచేత, బాధపెట్టే పనిని మాన్పిద్దాము అనేది.

"పని ఎందుకు చెయ్యాలి?"

"అవసరం"

"దేనికి అవసరం?"

"లోకానికి. దేశానికి. సంఘానికి"

అనడం తప్పు.

"ఆ మనిషికి ఆనందంగనక."

ఆనందంకాదా, పనిచెయ్యవలిసిన అగత్యం రాకూడదు.

ఎందువల్ల?

ఆనందం మనిషి జన్మహక్కు.

ఇప్పుడు జరిగే మార్పులన్నీ tinkerings అతుకులు. చేతులకీ నడుములకీ భరించరానిపని. జీవితమంతా పొట్ట గడుపుకునే యత్నం లో గడిచిపోతుంది. మరలనుంచి మనుష్యుని తప్పించాలనే ప్రయ

త్నంలో మనుష్యుల్నే మగలు చేస్తున్నారు. ఇప్పుడు బాగా శల్యగతాలైన అభిప్రాయాలన్నీ తారుమారుకావాలి. పైగా హితులు సలహాలిస్తారు;- "ఎందుకు వ్రాస్తావు, ఇంకా రెండువందల ఏళ్ళకి, కాని —"

"ఏదో కాలం మార్చవలసిందే మనం.-"

"ఈశ్వరుడు చూసుకుంటాడులెండి మనకెందుకు?"

ఇంతవరకూ మనిషిద్వారానేగాని ఈశ్వరుడు చూసుకోలేదు ఏదీ లోకంలో. పనిజరగాలంటే ఈశ్వరుడే మనిషి అవతారమెత్తుతాడు. నేను ఈశ్వరుడు. నాకన్న వేరు ఈశ్వరుడు లేడు. నాలో కట్టుబడ్డాను ఈశ్వరుడు, అందువల్లనే ఈ బాధ!

---

మనిషి అనుభవించగా మిగిలిపోయిన ప్రేమ - ద్వేషం, జాలి, ఉత్సాహం, ప్రేమ ఇవీ కళాసృష్టికి మూలం. అందమైన స్త్రీని చూసి కలిగిన మనోచంచలనాన్ని ఒకడు బూతులలో, ఒకడు శాశ్వతమైన కవిత్వంలో, శిల్పంలో; ఇంకొకడు ఆమెని రాత్రికి కలుసుకునే ప్రయత్నంలో తీర్చుకుంటారు. కాని చాలామందికి సంబంధమే లేదు సౌందర్యం చూసినప్పుడు. కవి సౌందర్యానికి ప్రతిఫలంగా ప్రతిఫలించే కళని సృష్టిస్తాడు. సృష్టి సౌందర్యాన్ని వ్యాఖ్యానం చేసి చూపుతాడు ప్రజల ముందు దృష్టికి.

ఒకవిధంగా అన్ని వుత్సాహాలూ అంతే.

ఎవన్నా కొత్త వుత్సాహం shallow youths లోతు లేని యువకుల్ని ప్రోత్సహించినప్పుడు, వాళ్లు దాన్ని భరించుకో లేక, పైకి పొంగి, అల తిరిగి. లోకం మీద పడతారు. తీవ్ర విద్యుచ్ఛక్తిని ఇముడ్చుకోలేనప్పుడే పైకి వెలుగు కనిపిస్తుంది. వెలుగు కనిపించకపోయినా, లోపలి శక్తిని సద్వినియోగం చాలా కొద్ది మందికే చేతనవుతుంది. అందువల్లనే మహాపురుషుల్ని సోమరిపోతులనుకుంటారేమో ప్రజలు!

సోషలిస్టు అని పేరు పెట్టుకున్నంతమాత్రాన, ఆ పేరువల్లనే, తక్కినవాళ్లకన్నా అధికులైపోయినట్టు feel అవుతారు, మాట్లాడతారు. కాని అంత మాత్రం, అనవసరమైన పొంగూ, అన్యాయమైన ఆత్మవిశ్వాసం, లేందే ఏ పనీ చెయ్యలేడు మానవుడు. బ్రహ్మసమాజంలో చేరినప్పుడు అట్లానే అనిపించేది.

'ఐన్‌స్టిన్! ఏం గొప్ప! బ్రహ్మో కాడుగా!'

'టాగూరా! పూర్తిగా కాడుగా!'

హిమాలయాలా, ఆకాశమా, పుష్పాలా! ఏ సమాజంలోనూ చేరలేదు అవి. ఏం గొప్ప నాకన్న అనిపించేది.

నన్ను చూడవొచ్చిన మిత్రులు,

"కె. పి. డి. రికార్డు హోటళ్లలో పెట్టడం తప్పు అన్నారటగా! మీరు?"

అని అడిగారు, నేను వ్రాసేవి నాకు జ్ఞాపకం వుంటాయను కొని. ఆలోచిస్తున్నాను, జ్ఞాపకం తెచ్చుకోడానికి.

కె. సి. డే. అంటే మండిపడే రసికులైన మిత్రులు జ్ఞాపకం వొచ్చారు.

“సామాన్యజనం వినకూడదనా?” అన్నారు.

నేను ఆలోచించి వ్రాసినది అర్థంకాకపోతే, నేను ఆలోచించకుండా చప్పున చెప్పే సంజాయిషీ అర్థమవుతుందా?

ఎక్కడ నా అనుభవం, నా ఆలోచన పద్ధతి, చదివే ప్రజలకి అర్థంకాకపోతుందోనని, చెప్పే విధంలో సొగసుల్ని, బింకాల్ని, బిగింపులని, శైలి నడకల్ని, కళని, చేతులారా, ధ్వంసంచేసి, నా thought ని diluto చేసే నా ప్రయత్నం, నా బాధ, నాకు జ్ఞాపకం వొచ్చాయి.

“ఇంకా అర్థంకాలేదా? లేక అర్థంచేసుకోడం ఇష్టం లేదా? తాము దేన్ని నమ్మడం తమకి ఉపయోగిమో, తమకి ఘనతనిస్తుందో, దానికి విరుద్ధమైన దాన్ని సహించడం ఎంత కష్టం!

కె. సి. డే. పాటల్ని హోటళ్లలో వినిపించడంలో వికృతం కనపడకపోతే, మీకు కె. సి. డే. ని వినే అర్హత లేదు. లేక కె. సి. డేకి మిమ్మల్ని మెప్పించే అర్హత లేదు. కళ అందరి సొమ్ము నిజం. కాని కళని అనుభవించగల అర్హత కొద్దిమందికే వుంది. అందటికీ వుండాలి ఆ అర్హత. లేదు మరి. నాకు paintings అనుభవించగల అర్హత లేదు. గొప్ప చిత్రాలు తగలపడుతున్నా నేను నొచ్చుకోను. కాని చిత్రకారుడు కుమిలిపోతాడు.

మనకి అర్థంకాని సౌందర్యాన్ని, [illegible], [illegible], ఇంతకన్న ఏమీలేదని చప్పరించి, సంతుష్టిపడతారు. నువ్వు కళలో లీనంకావాలి. కళ నీలో లీనం కాదు. స్త్రీ సౌందర్యాన్ని పూజించడం చేతకానవాళ్లు, స్త్రీని ఎన్ని విధాల వుపయోగించుకున్నా, ఆమె నీదవుతుంది_ కాని ఆమె సౌజన్యం నీకు చిక్కుతుందా? మల్లె పువ్వుల్ని నలిపి, చంటిపిల్లను గిల్లి, ఆడ ఆమెని అవిమి, ఆకాశం కనపడకుండా కిటికీ మూసి, జయించామని కులికే శునకత్వం పోనవాళ్లు ఇంతే.

అయినా యీ కళ జోలి నీకెందుకు? వొద్దన్నా జీవితంమీద సృష్టి సౌందర్యాన్ని గుమ్మరిస్తున్నవాళ్లు ఇంతేలే. విను. అందరికీ తిండిపెట్టు...కాని తిండికన్న ముందు...తిండిని జయించి... ఆకాశపు నీలమూ...గాలిలో చల్లదనమూ...నీళ్లలో మెత్తదనమూ... కాంతిలో ఉజ్వలత్వము...ఇవి వున్నాయి. ఇవే లేకపోతే... ఉదయాన్నే డళ్లమీద పువ్వులు నవ్వకపోతే, ముంగిట్లో పిల్ల గంతు వెయ్యకపోతే, చూర్లలో పిచ్చికలు అరవకపోతే, సీతాకోకచిలకలు ఆకులో ఎగరకపోతే, స్త్రీ కులకకపోతే నీ కళ్లముందు......తిండి తిని...తరవాత...ఎందుకు బతికి? పొన్నలూ, పొల్లూ, అందాల్ని వెదజల్లే పొలాలనించి పండుతున్నాయి. నువ్వు పుట్టగానే, అనవసరంగా, నీ తల్లి గర్భంలోంచి గొప్ప ప్రేమోద్రేకం కలగకపోతే, ఆమె స్తనంలో పాలు నీ నోట్లోకి వొచ్చేవా? గడ్డిమాడను ముందు పిడితేగాని, పాడ పాలివ్వదే?

సౌందర్యం, సుహృద్భావం, ప్రేమ, ఆనందం, కళ, వీటిని వొదిలి, ఏ ప్రయత్నం చేసినా, ఎంత ఉత్సాహం ఉద్ధృతం చూపినా ఎంత త్యాగం చేసినా, వృథా.

ఎంతమారం వెళ్లినా, ఏమీ దొరకక, పరుగు వేడి తప్ప ఏమీ పొందేది లేక, వెనక్కి తిరగవలిసిందే!

ఏ ప్రోత్సాహాలు మృగాల్ని మనుషులుగానూ, మనుషుల్ని నాగరికతలోకి, evolve ఎవాల్వ్ చేశాయో, వాటిని వొదిలేస్తే...

అంతకన్నే వెనక్కి పోతాం. కృతయుగంలో ధర్మం, అపక్వాహారం, ఉపవాసవ్రతాలూ, బట్టలు వొదులుకోవడం, గడ్డాలు పెంచడం– ఇవన్నీ వెర్రికలలనిపిస్తుంది.

కె. సి. డే. ప్రతివార హక్కు. ప్రతివారూ వినాలి. అని గోలపడే వారు, ప్రజలకోసం ప్రయత్నించేవారు...ప్రజలకి భోజనమే కాదు, కళనీ, జ్ఞానాన్ని, పంచిపెట్టాలని, పెనుగులాడేవారు... ఏంచేస్తున్నారు...వాళ్ల బాధల్ని తీసేసేందుకు...?

"దరిద్రం, అధికారగర్వం, యీ సంఘక్రూరత్వం, ఆకలి, స్త్రీల సుకుమారత్వం, పిల్లల అసహాయత్వం..."

"ఈ ఘనసమస్య పరిష్కారమయిందా..."

"అందాకా, యీ వివాహం, యీ విద్య, యీ కాపీనం..."
ఏం చేస్తున్నారు? మీ కాలం, మీ శక్తి, మీ ధనం... ఈ లోపల, పక్కనమూలిగే ముసలమ్మకన్న, దిక్కులేక తడిసే పిల్లికూనకన్న... మూడు తరాల తరవాత సంతతిమీద ఎక్కువ దయ......దగ్గర బళ్లో హింసించే టీచరుకన్న, పెళ్లి చేసే తల్లిమీదకన్న, తన్నే అధికారి మీదకన్న, దాచుకునే వర్తకుడిమీదకన్న, కనపడని దేవుడిమీద, కాశీలో ఆలయాలమీద, బొంబాయిలో కోటీశ్వరుడిమీద కోపం.

'సంస్కారం, ప్రజాక్షేమం' అన్నారు గనక వ్రాస్తున్నాను యీ మాటలు. కర్మపరిపాకం మాట్లాడే వేదాంతులలో, స్వలాభం తప్ప యోచనలేని మర్యాదస్తులతో నాకు పరిచయమే వొద్దు.

అట్లాగే- వెముకలు వొంగే, గుండెలు ఆగే, రక్తం ఎండే మనసులు మండే, జీవశక్తి నశించే, బడిపిల్లలమీదకన్న, దిక్కులేక అల్లాడే ప్రజలకన్న, మృగాలమీద దయ-

తిండిలేని పిల్లలమీద, పుళ్లుకారే గుర్రాలమీద, బళ్లు లాగే మనుషులమీద, తెల్లార్లూ ఏడ్చే కుక్కలమీద, నడుంవరకు తెగిన మిడతలమీద- దయకన్న - జంతుబలులమీద కోపం.

"హరిజనవిద్యార్థి" అనే దాంట్లో హరిజనులకన్న బ్రాహ్మలకే ముందు సహాయం చెయ్యాలి, అన్నారుగా?

అవును. కారణాలు చూపాను.

ఏమైతేనేం, అన్నారుగా! అన్నాయి వాళ్ళ కళ్లు

బ్రాహ్మణులమీద నాకేం ప్రత్యేకం ద్వేషం లేదు అంటోంది నా మనసు.

హరిజనుడంటే ప్రత్యేకం ద్వేషం లేకపోతే చాలదు.

ప్రత్యేక ప్రేమకావాలి.

బ్రాహ్మణుడంటే ప్రత్యేక ఘనత లేకపోతే చాలదు.

ప్రత్యేక ద్వేషం కావాలి.

తనతో సమానంగా తక్కిన పిల్లల్ని చూస్తోందని తల్లిమీద కోపగించే పిల్లలాగు.

ఆ నాడు తనకు కష్టం కలిగితే నేం. తల్లి హృదయంలోని ఆ సమత్వం, తన జీవితానికి దీపమౌతుందని తెలీదు పిల్లకి.

బ్రాహ్మణుడూ, హరిజనుడూ- ఈ మాటలకి అర్థం లేదనేవాడి కన్న హరిజనుల్ని, బ్రాహ్మల్ని ద్వేషించేవాడే సన్నిహితుడు.

సంఘసంస్కారంలో ముఖ్యంగా యీ రాజకీయంకోసం జరిగే సంఘసంస్కారంలో ఉండే shallowness కృత్రిమం, కన పడదు మనుషులకి.

"చాలా మారిందండీ లోకం! పూర్వం మీరు ఇతర జాతి వారితో భోజనాలుచేసి వెలిబడ్డనాటికీ యీనాటికీ......"

నిజమే మారింది. అధికంగా మారింది. ఏం మారింది లోకం అంటే,

ఈ "అంటే?" అనే మాటని చూస్తే ఎంత కోపం, ఎంత ఇబ్బంది ప్రజలకి? 'ఆలోచించు' అన్నమాట. ఆలోచించడం ఎంత బాధ! కాని అనక తప్పదు.

అంటే? ఆచారాలు మారాయి. కాని హృదయాలూ?

కాస్మపాలిటన్ భోజనాలలో ఎంత ప్రేమ, ఎంత సమత్వం ఎంత స్నేహం వున్నాయి? జాతిని జాతి, కులాన్ని కులం, తిట్టుకుంటో అనుమానించుకుంటో, పోటీలు పడుతో _ ఒకే పంక్తిలో భోజనం.

స్త్రీకి ఎంత స్వేచ్ఛ, ఎన్ని కొత్తనగలు, పౌడర్లు, మీటింగులు ఎదిరింపులు!

పిల్లలమీద ఎంత ప్రేమ! ఎన్ని బడులు, ఎన్ని బెత్తాలు!

అధికులమనే పూర్వపు బ్రాహ్మణులు, భార్యల్ని తన్నే భర్తలు, ముంతపొగలు పెట్టే తల్లులే నయమేమో!

అట్లానే మతం యీ దేశంలో. Half sentiments, half superstitions, and all through selfishness,

హరనాద్, శాయి బాబా, రమణ మహర్షి.

నేనిస్తాను పుచ్చుకో.

నేనడిగింది ఇచ్చుకో.

కాకపోతే నువ్వెందుకు?

నేనడిగిందానికి,

నీకు నేనేమివ్వాలి?

భజనలూ, స్తోత్రాలూ చాలా, ఇంకా దానాలూ, సంతర్ప ణలూ, మొక్కుబళ్లూ కావాలా?

చాలా ఖర్చుగా వుందే! నాకు కావలిసింది తీరాచేస్తాడో

చెయ్యడో ఆ ఋషి. ఇంతకన్న తిరుపతి మొక్కులు నయం.

పని జరిగితేనే fees.

ముగుళ్ళని బతికించి, జుట్టు నిలపెడితే,

ఆ జుట్టుని నీకిస్తా.

సబావుగా, తెలివిగా వుంది బేరం!

దేవుడా! నువ్వేవుంటే,

నీభక్తుల్ని చూసి ఎంత సిగ్గుపడుతున్నావో!

నిజమైన కళ కవి sub-conscious లోంచి బైలుదేరుతుంది. అందువల్ల ఎప్పుడూ సాహిత్యము ఆనాటి ప్రజల దౌర్బల్యాల్ని నిజ స్వభావాల్ని వెల్లడించి తీరుతుంది. సంస్కృత భారతం నాటినించి, ఉద్భవించిన శ్రీకృష్ణుడి చరిత్రని యీనాటివరకు పరిశీలిస్తే మన దేశపు ఆధ్యాత్మికాభివృద్ధి స్పష్టమౌతుంది. తెలుగు భాగవతంలో కృష్ణుడు, అల్లరికీ, మోసానికీ, మోహాలకీ అతీతుడనే భావం చూపిస్తాడు. కవిగాని పోతన్న కృష్ణుడ్ని ఘట్టాలలో కవిత్వంలోకి break అవుతాడు. కృష్ణపతనానికి ప్రారంభకుడు తిక్కన. అర్జున సారథికీ, భగవద్గీత బోధకుడికీ, సంబంధం నడిపించలేకపోయినారు తిక్కన్నగారు. తిక్కన్న shallowness, కృష్ణుణ్ణి heart-less plotter ఇతరుల పతనంలో సంతోషించే petty scoundrel ని చేసింది.

తరవాత కొన్ని మెట్లు శ్రీకృష్ణుణ్ణి దిగజార్చింది ప్రబంధకవులు- ఎన్ని కావ్యాలు - ఎన్ని వర్ణనలు - సమస్తమైన అసహ్య శృంగారమంతా, తనివితీరా కృష్ణుడి నెత్తిమీద బోర్లించి కృతార్థులైనారు. అంత అసహ్యాన్ని, అంత నీచత్వాన్ని సమర్థించి మంత్రపు నీళ్లు చల్లి మడి కట్టించేందుకు కృష్ణనామం బహుబాగా ఉపయోగపడ్డది. భాగవతంలో కృష్ణుడు చేసిన అన్యాయాలూ, అల్లరులూ పవిత్రం కాలేదా, అట్లానే యీ శృంగారాలూ, జారత్వాలుకూడా ఆ కృష్ణస్పర్శవల్ల ఆధ్యాత్మికాలు కావా అన్నారు కవులు. ఆ సాంప్రదాయాన్నే చక్కగా అందుకున్నారు నవీన కవులు. తమ శృంగార భావాల్ని, విరహాల్ని, ఆశల్ని, కలల్ని అన్నిటినీ కృష్ణుడికి అంటకట్టారు. రాధ యేడుస్తోందని, తమ imaginary ప్రియురాలి మాటలు ఆమె నోట పెట్టి, తాము కృష్ణులమని కులికారు కృష్ణుడి వేణునాదం వొంకపెట్టి, తమ ప్రియాలాపాల్ని వర్ణించుకున్నారు.

నీచుడూ, భీరుడూ hen-pecked muff అసమర్థ దంభకుడూ స్త్రీ దాసుడు - ఏం కాలేదు? ఆ నాటక కర్తలకు యీ కృష్ణ వేష ధారులు, పొట్టివాళ్లు, బొర్రలవారు, మరిగుజ్జులు, తాగుడువారు, పొట్టి మీసాలవారు, పేడిమూతులవారు, గంతులవారు, కురూపులు, కుర్చీలకింద దూరేవారు, అరగంట రాగాలవారు, నీలపురంగు బని యన్లు వేసి, నెమలియీకలు కట్టుకుని దొంగ చూపులుచూసే దౌర్భా గ్యులు - సహాయపడ్డారు - శ్రీకృష్ణుడి పాడెకట్టడానికి. ఈ పురుష సత్యభామలూ, బొండు రాధలూ, చావుమేళం వాయించారు.

తెలుగు ఫిల్ములు శ్రీ కృష్ణుడికి అస్తి సంచయనాన్ని కాని చ్చాయి. కృష్ణలీలల్లో కృష్ణుణ్ణి చూసింతరవాత భాగవతం చదవడం పాపమనిపిస్తుంది. ఒకసారి పరధ్యానంగా ఎదో ఫిల్ము అనుకుని వెడితే - ఆ జరిగేదేమిటో తెలీక - మళ్లీ తెలుగే - పక్క ఆయన్ని అడిగాను - ఏం ఫిల్ము అని. రుక్మిణీ కళ్యాణమన్నాడు. తీరా వొచ్చా నుకదా - తెలుగు ఫిల్ములు చూడనని ఆంధ్రాభిమానులు నన్ను నింది స్తున్నారని - కూచుంటే - ఆ కృష్ణుడి సంగతీ - ఆ రుక్మిణి సంగతీ - తనివితీరా వ్రాస్తే - డిఫమేషన్ కింద వొస్తుందేమోనని మానుకుంటు న్నాను. అద్భుతంగా, మానవత్వమూ, దేవత్వమూ ఐక్యమైన శ్రీ కృష్ణుణ్ణిట్లా మురికి బురదలో తొక్కితే - ఏ భక్తీలేని నాకు కూడా దిగులు పుడుతుంది. భక్తులకి కష్టపడదులెండి. పైగా నేనెదో యీ పురాణికాదర్శాలని ధ్వంసం చేశానని యేడుస్తాయి పత్రికలు! పైగా బూతుకథలు వ్రాస్తున్నారని యువకులసిలిట్టే యీ ముసలి ప్రభువులందరూ, దొంగలు కార్చుకుంటో గుంపులు గుంపులు పోతారు, ఆడవేషాలు వేసుకున్న మొగాళ్ల కులుకులు చూడ్డానికి, పతివ్రితల వేషాలువేసి ప్రియుల్ని సంపాదించే తారల అందాలు చూడ్డానికి. బాగా చూసివొచ్చి, ఆ స్త్రీలని నోటికి వొచ్చిన తిట్లు తిట్టి, పుస్తకాల్ని, ఉచితంగా యాచించి తీసుకుని, బాగా దాచు కుని చదివి, యిష్టం వొచ్చినట్టుతిట్టి, తమ పవిత్రతని సమర్థించు కుంటారు. బూతు బతుకులు బతికే పండితులూ, నోటివెంట బూతు లులేకండా మాటరాని శాస్త్రుల్లూ, బూతులులేకండా చీట్లపే క ఆడలేని - క్లబ్బువాలాలు, నవీన వాంగ్మయంలో బూతులు ఏరి, ఉచ్చరించి ఏడ్చేవారే!

పక్కమీద కళ్లు తెరచేప్పటికి సూర్యుడు కళ్లల్లోకి మెరిశాడు. నా జీవితంమీద సుడ్డి ఎక్కడ ప్రకాశింపపోతున్నాడు అనుకుంటో మళ్లీ కళ్లుమూశాను.

ఈసారి సూర్యుడే లేపాడు. మబ్బుల సందుల్లోంచి. ఎన్నాళ్లయింది యిట్లా తీరుబడిగా పక్కమీద మాస్తో పడుకుని చప్పున ముంచుకుపోయినట్లు తొందరగా లేవకుండా!

పని...పని...పని...పని వుందనే ఆదుర్దా.

సంపాయించే పనిగాక, తెచ్చిపెట్టుకున్న పనులు- చాలా గొప్పవనుకుని, పనులవగాలంగా మనసుకి గర్వం తెచ్చుకున్న పనులు. చదువు స్నేహాలలోకి, స్నేహం ముద్దులలోకి మారదా, అనే ఆశతో, కుర్రడిమీద భారంవేసి నెత్తిన వేసుకున్న పనులు-

మబ్బు సూర్యుడిమీదికి జరిగింది.

ఇట్లానే నిన్న గం___గారి ముఖంమీదికి విచారం పాకింది___ తిరిగి తిరిగి ప్రయత్నించి నవ్వాలని. విచారాన్ని మింగి మాట్లాడాలని యుద్ధంచేసిన పెదిమలు. కొనలు కిందికి నా గుండెమీదికి జారిన పెదిమలు.

"నేనున్నాను. భయం లేదు."

ఉన్నాను. కాని భయం లేదా?

ముందు నాకు భయం లేదా? నావల్ల భయంలేదా?

మాటలు. ఓదార్పులు.

అభయమిచ్చాననీ, తీసుకున్నాననీ, ఆట మా మధ్య.

ఏదో అశాంతి. ఎవరో తీర్చగలగని అవ్యక్తపు ఆశ. ఇన్ని స్త్రీ హృదయ రహస్యాలను చిత్రించినవాడు, తనకే తెలీని తన రహస్య సమస్యని విప్పి చూడలేడా అనే ఆతృత.

ఏం చెయ్యగలను?

భోజనం పెట్టగలను. అంతే.

చాలా?

(12)

ఆమెకి భోజనం లేనివాళ్లుంటారని ఊరికే మనసులో మాత్రమే వూహించుకోడమే కష్టసాధ్యమైన ఆమెకి! నేను భోజనం!

తరవాత...తరవాత...24 గంటలలో భోజనం_ ఓగంట.

తరవాత? ఇంకా...దేహం చాలా విశాలం...మెదడు___ హృదయం...

పక్క మీదనించి లేవాలి. మొహంమీద ఎండ. కాని ఆమె...

ఎందుకు ఇప్పుడు ఆ సంగతి?

మొదలుపెట్టింది పనిచెయ్యడం యీ ఇన్ జన్

ఇంతే మళ్ళీ రాత్రి మైమరిచిందాకా ఇంతే, యీ మెదడు factory, ఎవరికీ కొరగాని ఆలోచనగా సామగ్రిని తయారుచేస్తో.

మాటలు. వ్రాతలు. పుస్తకాలు_ విమర్శలు_ కాలం వ్యర్థం చేసిందాకా. ఇట్లా కాయితాలని, మనుషుల్ని పట్టుకు వేళ్ళాడతాయి, యీ ఆలోచన goods.

చిన్నది, తెల్లనిది, యీ మాంసపు ముద్ద. పుర్రెకిందనించి యీ ప్రపంచాన్నే సృష్టించుకుంది.

భూమ్యాకాశాల్ని నీడలతోనించి, దీనికంతా అర్థమేమంటుంది. తననీడకి ఉత్పత్తి తనే వెతుక్కుంటుంది.

తను గీసిన బొమ్మలో తాను తిరుగుతుంది వేలకువేల మైళ్ళు. అనంతకాలం మధ్య హోరుమని ఏడుస్తుంది. కనిపాపలో ఇమిడి కాలిపోతుంది.

ఏమైతేనేం? ప్రస్తుతం రైలు స్టేషన్ కి నన్ను మాంటోంది 'టీ' తాగటానికి.

సైరంధ్రి వలువిడితో మళ్లే, రాత్రింతా గాలి తన అవస్థను మైదానంతో చెప్పుకుని ఏడ్చింది గావును;

అంతటా తడి. ప్రతి గడ్డిపరకనీ వెతికి దేవకన్యలు అలంకరించిన గులేబుల్లో రంగుల దీపాల్ని వెలిగిస్తున్నాడు సూర్యుడు. ఆ రంగులమధ్య, గడ్డి కొమ్మనించి గడ్డికొమ్మకి దూకి ఆడుకుంటున్నాయి మిడతలు. ప్రతి మంచు బొట్టులోనూ మెరిసే ప్రతి సూర్యుడూ, ఏ ఏ లోకాల్ని వెలిగించుకుంటున్నాడో!

కాలమూ, దూరమూ_ ఈ భావాల్ని ఏనాటికన్నా అధిగమించి పనిచేస్తుందా యీ మనసు!

మంచు బొట్లలోని solar system నీ, ఆకాశంలో infinite లో మనుషుడికి తెలీని గెనిమట్లూ యీ నక్షత్రమండలం తిరుగుతోం దో ఆ centre of all systems నీ ఒక్కసారిగా గ్రహిస్తుందా యీ మనసు ఏనాటికైనా!

నేను మైదానం దాటుతున్నానా మైదానం నన్ను దాటుతోందా?

మనుషులు కాలంలో భవిష్యత్తులవేపు నడుస్తున్నారా? విషయాలు మనుషులమీదికి నడిచి వొస్తున్నాయా? కదిలేది ఏది? స్థిరంగా వుండేది ఏది? రెండూ కదులుతున్నాయా? ఏదీ కదలందే కదులుతున్నామనుకుంటున్నామా? ఈ సూర్యుణ్ణి వొదిలితే కాలమనేది ఎక్కడవుంది? మనసులోతప్ప! తన యిష్టప్రకారం సాగే కొలతలతో నడిచేమనసు, నిలిచేమనసు, పరిగెత్తేమనసు, కాలాన్ని ఏం కొలుస్తుంది?

నిన్నరాత్రి కళ్లు మూసుకునేప్పుడు ఎదురుగా బృహస్పతి. కళ్లు తెరిచేప్పటికి శుక్రుడు.

నేను తిరిగానా? ఆకాశం తిరిగిందా? గడియారం తిరిగిందా?

మైదానం మధ్య ఆగాను. నా ఆనందమూ ఆగింది. కదులుతో వుంటేనే గాని ఆనందించలేను. ఆగి ఆనందించాలని చూసిన నా అదృష్ట శృంగార సమయాలు జ్ఞాపకం వొచ్చాయి.

ఆగి ఆనందించగల గుణం అబ్బుతుందా యీ మనసుకి ఎన్నటికైనా, భగవాన్.

నీకు చాతనౌతుందంటావు.

ఆగితేనేకాని నిజమైన ఆనందం అనుభవంలోకి రాదంటావు.

ఇట్లా కదులుతో, వెతుకుతో, మింగుతో వుంటేనేకాని ఈ ఏడుపు తప్పదా? ఈ అశాంతి!

స్టేషన్‌కి ఎదురుగా రోడ్డుమధ్య ఒకామె. కప్పడానికి బట్టలు లేని ఆమె దరిద్రపు రొమ్ముని తలతో తడుముతో పిల్ల. తలెత్తి నన్ను చూడలేదు. ఆమెకి లోకం లేదు. ఆ కళ్లు ఎక్కడా లేవు. సాయంత్రం నా వరండాలో పిల్లకి పాలిచ్చుకునే మేక శుభ్రమైన నగ్న నిర్లక్ష్యం ఆమెది. ఆమెని పొడుస్తే 'స్పెన్సర్' లో 'టీ' అవసరం లేదు.

ఆ స్టేషన్ వూడ్చే మనిషి వొచ్చాడు. అతనికి చాలా లోకువ. దుమ్ములో కూలబడి ఎవరిని చూసీ, కప్పుకోడానికి కుమిటలేని ఆడది. కులకక, సిగ్గునటించక, ఏడుపు మొహం పెట్టక, లోకాన్ని మరిచిన ఆడది.

అతని కంఠంలో జాలి. చూపు రైల్వే పోలీసు కొట్టువేపు.

“మీవాళ్లేవా, అక్కడ?”

అతనివేపు కళ్లన్నా ఎత్తకుండానే, ఔనని వూయించింది తల!

“మాటలేనా?”

మళ్లీ తల వూయించింది.

అంటే? అని ప్రశ్నిస్తోంది నా మనసు. తనకేమీ జోక్యం లేని విషయంలో.

అసలు ఆ వూడ్చే అతనికే జోక్యంలేదు ఆమె వ్యవహారం. అంతకన్న నాకు లేదు. కాని తెలుసుకోవాలి తెలుసుకోకపోతే, టీ తాగినంతసేపూ “మాటలేమిటి” “మాటలేమిటి” అని రాగుతో నేవుంటుంది బుర్రలోపల.

స్టేషన్ గుమ్మంలో.

“దొంగతనం జరిగింది. మాటల దొంగతనం.” అంటున్నారు ఘరానావారు, కార్మికులూ, పోర్టర్లూ.

“దొంగతనం” ఎంత ఉపద్రవం! తమకేమీ సంబంధంలేని దొంగతనం. కాని ఈనాడు _ వాళ్లకైతే రేపు _ తమకీ! వీల్లేదు దొంగతనం! సంఘానికి గాయమయింది. ఈ ఈగలన్నీ జొయ్యిమంటున్నాయి ఆ పుండు చుట్టూ.

నా పుస్తకాలు చేసిన గాయాలచుట్టూ ఇంకా మానలేదు మూలగడం, పోతుటీగలు, డిగ్రీల యీగలు, ముసలి యీగలు, మురికి యీగలు, దుష్పదార్థాలతో కళ్లు పూసిన యీగలు.

మూడు మాటల దొంగతనం! అంటున్నాడు హిగింబాదమ్సు కుర్రాడు. చలం ఆరాధకుడు.

స్టాలుకి అంటుకుపోయి పోస్టరు,

“బాంబులుపడి 400 మంది చచ్చిపోయినారు” అని అరుస్తోంది, ప్లాటుఫారం కంకరకి. లోకక్షేమం నడుమున కట్టుకున్న దేశాలకి జరిగిన గాయంమల్లే.

"రాత్రింతా మా కోడలికి నిద్రలేదు. ఒకటే కడుపునెప్పి."
అని వాటుతోంది ప్రయాణీకులకి ఒకామె, తన హృదయంలో కొడుక్కి ఇచ్చిన భాగానికి తగిలిన గాయంమిట్టూ.

లండన్‌లో యుద్ధం.

ఢిల్లీలో భయం.

ఏలూరులో కోమటి కడుపునెప్పి.

రైల్లో దొంగతనం.

నా కడుపులో దాహం.

"ఎన్ని బీరు బుడ్లు? నిన్న రాత్రి ఖర్చెంత?" అని అడుగుతోంది స్విస్సరు తాత్కాలిక యజమానురాలు.

ఏం ఖర్చు? బీరుబుడ్ల ఖర్చా? రూపాయల ఖర్చా! ఆరోగ్యం ఖర్చా! తాగిపోతున్నారో, అని యేడ్చే మర్యాదస్తుల కడుపుమంట ఖర్చా!

గడచిన నెలలో బద్దలైన సామాన్లకి మూడురూపాయలు

రూపాయి నిర్బంధపు - చందా.

జాలితలిచి కొనుక్కొని పెంచుకొంటున్న పిల్లపాలకి నాలుగున్నర.

నడుంలో నెప్పి,

నిలువలేక తెచ్చుకున్న రోగం పిచికారీలకి తక్కింది-

నడుంనెప్పి. 17 గంటలపని. లెఖ్ఖపెట్టే యజమాని.

Boy! omlette!
Boy here! damn you - "I will kick you"
Where is that bloody boy? come here
Boy, Boy, Boy!

రెండణాలు జేబులో వుంటే సరి Boy! Bloody Boy! సువ్వర్,...కొడకా!

"Boy వేడిగా, light గా, బాగా కడిగిన కప్పులో_ టీ. టీ. టీ."

మొదటి గుక్కతో శాం...తి.

దొంగలుపడితే నేం?

బాంబులుపడితే నేం?

కడుపునెప్పి పడనీ? నాకేం?

పొట్టకీ, మెదడుకీ, ఎంత తొందర సంబంధం?
ఆలోచన. సుఖంగా పేము కుర్చీలో ఆలోచన.
ఎవరో దొంగతనంచేసిందా? ఆమెకి అన్నా! భర్తా!
ఏంచేస్తుంది ఇంక? దుమ్ములో కూచుంటుంది.
సుఖదుఃఖాలకి బండబారిన ముఖం!
ఏదీ surprise లేదు.
జీవితం తన కిచ్చింది ఏమీ లేదు.

మానుషులు తననించి తీసుకుపోయేది ఏమీ లేదు. పాకీ అతని ప్రశ్న తనకేం తెలుసు! కాయితంమీద అధికారుల ప్రశ్నలు నాకు తెలుసు.
డబ్బు, ఆస్తి, గౌరవం, జీతం,
యివన్నీ కాపాడుకునేవాళ్ళకి తెలుసు.
తలన్నా ఎత్తదు.
సుఖమంటే తెలిస్తేగా,
పోతుందని భయానికి!
పాకీ అతనూ, కోపమొచ్చి తంతావా? చెప్పలేదు.
లేచిపొమ్మంటావా?
ఇక్కడైతేనేం, అక్కడైతేనేం, ఆ గోతులో నైతేనేం?
నా గుడ్డకి మార్పు లేదు.

"400 మంది చచ్చారు. తెలుసునా? అణాపట్టులకి ఆ వివరాలు చెపుతా" నని అరుస్తోంది పోస్టరు.

"వాళ్లు చస్తే నాకేం? నా కోడలికి కడుపునెప్పి. దాని సంగతి ఏంచెప్పారు?" అని అత్తగారు.

దొంగతనం, బాంబులు, క్షామం, కడుపునెప్పి, చావు, 'టీ' లో ఈగ. పాకీ అతనికి కొమ్ములు మొలిచినా, surprise లేదు.

దేనికి చేశారో దొంగతనం? అని, అర్ధణా ఖరీదైన సిగరెట్టు వెలిగిస్తో నేను.

సోషలిజం వొస్తే దొంగతనం పోతుందా?

'మాలపిల్ల వ్రాసింది మీరేనా? ఏంబావుందండీ!" అంటో నా సిగరెట్ పెట్టె దొంగిలించిన Socialist Gentleman.

అతన్ని చూసి, మహాత్యాగి అని గర్వపడే భార్య. తలుపులు వేసుకోకూడదా ఇంటికి నేను? సైకిల్ పంపు పోయినా బుద్ధిలేదు.

సిగరెట్ పెట్టెలు ఇప్పుడైనా జేబుల్లో దాచుకోకూడదా?

చిరుగు గడ్డం భార్య వాణికి రొమ్ముని కప్పడానికో, తడుముకునే పిల్ల పెదవుల్ని తడపడానికో,

మాటలు దొంగిలించినవాళ్లు స్టేషనులో లాకప్పు. అణాకానికి అయి అబద్ధాలు చెప్పే, సిబ్బందికి లోకువ. నవ్వడానికి, తిట్టడానికి, కొట్టడానికి - జైలులో మగ్గయ్యడానికి - ఆ గోడ్డుమీద భార్య అంత మురికిగా లేకపోతే... అదే ఆశే టోపీలవాళ్లకి.

భార్యకి నిష్ఫిహా...

మర్యాదపు కొంగల భార్యలకి గర్వం.

"మావారు మొన్న లాటరీలో..."

"చాలా భయంలెండి. వారు ఎక్కితే గాలు. అపకర్షం డానే కుగుస్తుంది రూపాయల వర్షం"

"అన్నీ సన్లైలు. మేము నెయ్యి కొనంగా...మావారు..."

"ఆ బస్తా పుమ్ముకనగలూ...నాలుగు బస్తాలలో..."

"మావారి తెలివి ఎవరికి వుండేదీ..."

"కట్టెక్కరుకండి...మా అమ్మాయిని చూస్తే...మా అమ్మాయి ఎప్పుడూ ఆయన బంగళాలోనే..."

"...సైన్యంలో చేర్పించి ఎంతమంది బీదలకి అన్నం పెట్టారు?..."

"ఏడువేలు గుమ్మరించే వాడే వొస్తాడు పిల్లనిస్తానని! అందాకా వుంచుతాను మా అబ్బాయిని..."

మర్యాదస్తులు.

"నేను మా అబ్బాయికి చూసిన పిల్లలెవ్వరూ అనాథలు కారు."

"పోర్కు చెప్పకండా ఇస్తే, తప్పకండా పుచ్చుకుంటా. చపితేమాత్రం... ఎంతైనా బ్రాహ్మణపుటక..."

"నాలుగువేల రూపాయల పది అణాలు పెట్టి కారు కొని పెట్టా. అది (భార్య) యెక్కి తిరగడానికి, పదివేలరూపాయలకారు... కాని చూడండి నా దవడమీద కొట్టి...నాముందే వెంకయ్య చాదరితో..."

పాపం. నిన్న సాయంత్రం నా యెదురుగా కూచుంది. తెలు స్తోంది, ఆమె అంతా కనుక్కున్నదని- భర్త చౌర్యమంతా.

కనుక్కుని...

ఎందరు స్త్రీలో కనుక్కున్నారు...కష్టపడి, నీచపడి, సిగ్గుపడి కనుక్కున్నారు.

కనుక్కుని...

లోపలే కుక్కుకున్నారు.

పైకి భర్త గొప్పమీద డాబులు.

లోపల భర్త ద్రోహంమీద శోకులు.

నీ రూపాయలమీద తిరగబడు.

నీ ఉద్యోగంమీద మండిబడు.

నీ బానిసత్వంమీద ఎగిబడు.

చీకటి బూజుగదుల్లో నలిపేవాండని బంధించి కక్కు విజ్ఞానాన్ని బెత్తాలతో జూన్మానాలతో ఎక్కించే గొడ్రాళ్ళు భోగానికి తిరగబడు.

సరేలే.

సోషలిజం వొస్తే దొంగతనం పోతుందా?

డబ్బు సంపాయిస్తేమాత్రం వ్యభిచారం పోతుందా?

అంతకన్న

పోనీ దొంగిలిస్తేనేం? అను

పోనీ వ్యభిచరిస్తేనేం? అను

వెర్రి ఆశల్ని రేకెత్తించకు.

దామకునేతనం, ఎప్పటికెట్లా వుంటుందో అనే భయం - వాడికి లేకండావుంటే చాలుననే ద్వేషం, పనిలేకండా పడేసుకునే చేవాడితనం,

ఇంకా, ఇంకా, ఇంకా నాకే అనే కక్కుర్తి,

నా అంతవాడికి అనే గర్వం

భర్త భార్యల విషయమై సోషలిస్టు ఏనాడని.

అది ఇష్టంగాలేదు ఆమెకి.

"ఇది ఎవరిడబ్బు?" "వాడి తాతసొమ్ము!" అన్నంతవరకు.

"ఎవరిడబ్బు?" అనలేదు.

కాని భర్త పైనూసి వళ్ళిన ఆమె వొంటిమీద వాసనలతో......ఆ వుక్కలో......కిటికీలేని ఆ మూల......మళ్లీ తన పక్కన......

చల్లగాలిలో పచ్చికమీద పడుకోకూడదా వాళ్లు! అనుకున్నా నా రాత్రి.

కాని ఆ రెండో ఆమె వొంటి చీర పరిమళాలతో......ఎట్లా కావలించుకుంటో ఆ రాత్రి! అని ఏవగింపు నిన్న సాయంత్రం!

"ఏం చెయ్యమంటావు?" అన్నాయి ఆమె కళ్ళు.

"వొదిలెయ్యి" అన్నాయి నా పెదిమలు.

వొదిలేసి?...

భోజనం?

సరే:

ఆగింది,

రాత్రి......చివరికి ఆ బూజులమూల, గుంట మంచంమీద పడ్డా, వంటచీరల పరిమళాలతో పైనా, పోనీ, కరిచే వానరాలకి ఎవరు శాంతినిస్తారు? అంటుంది.

అన్నం పెడతావా?

తరవాత...

ఏం చెప్పను?

ఎవర్ని నాపిల్ల 'నాన్నా' అని పిలుస్తుంది?

"ఈ పిల్ల సరే! నా కోసం ఆకాశంలోంచి తడుముకునే పిల్ల! ఆ బూజుమూల చీకట్లో, పసిపుక్కంటతో, నాలోపల రాచూసినపిల్ల! ఎవరుదిక్కు! నువ్వా?" అన్నాయి కదలని ఆమె పెదవులు.

"తిరగబడు, లోబడకు."

మాటలు మంచివే! తిరగబడి? తరవాత?

చలం, జవాబు చెప్పా.

నన్ను వదిలెండి. నాకు తెలీదు.

మీరే కాదు, దేశాలు ప్రశ్నిస్తున్నాయి.

తిరగబడి! తరవాత...

నీకేం? మాగతి ఏమైతే నీకేం?

ఇంకో రెండు కథలు వ్రాస్తావు.

నాలుగణాల టీ, రెండణాల సిగరెట్లు, నీకు పొద్దున్నే......
నీవరాలా? మొగాడివి...నీకేం?

జేబులో రూపాయలు. స్నేహితులు...నీకేం?
వ్రాస్తావు. నీ కలం నడిచినట్లల్లా. నీకేం?
ఆతుర్తతో ఏదో చెపుతావని చదివే అనాధలం.
నిన్ను ఎదురుగా ప్రశ్నించే, నిర్భాగ్యులం.
కుర్చీ దిగు,
సిగరెట్టు పారెయ్యి,
గుమ్మం కదులు,
మాతో రా, మట్టిలోకి.
దిక్కులేని తనంలోకి,
పిల్ల, పాలులేని నీ రొమ్ము పీకిందా?
కీళ్లు కదలక నీ తల్లి పక్క గోతిలోకి దొర్లిందా?
బిడ్డతో కారిన రక్తం, బొడ్డుకి కుంకం పెట్టిందా?
చెపుతావు కబుర్లు.
నీ కళ్లనిండా యీగలు మూగాయా?
నీ పుళ్లలోపలే పురుగులు ఎదిగాయా?

రాస్తావు రాతలు! టీ కప్పు ముందు పెట్టుకుని, పట్టు లుంగీ కట్టుకుని!

"నువ్వు చెప్పావని శ్రీరాముణ్ణి వొదిలేను" అని లవకుశుల్ని చెరో చేత్తో పట్టుకుని సీత నీ గుమ్మంలో నుంచుంటే ఏం జవాబు చెపుతావు చలం?

జాతకంకింద దాక్కుంటావా?

ఇంకో సిగరెట్టు వెలిగించావు.

టీ ఖర్చు...ఒక రోజు సంసారానికి తిండి, లెఖ్ఖ బాగానే వుంది. ఏ సంసారానికి? ఎందుకా సంసారానికి? అసలు సంసారం ఎందుకుంది?

నువ్వు సంసారం పెట్టుకోడమూ? నేను టీ మానుకోడమూనా?

నిన్న రాత్రి రేడియోలో 'ఇలాగోష్' కోసం హోటల్లో wait చేస్తోవుంటే—

పొద్దస్తమానం అడుక్కున్న గుడ్డిఆమె డబ్బులు, ఎక్కణ్ణించో వొచ్చి లెఖ్ఖ చూసుకుంటున్నాడు – దిట్టమైన మొగమనిషి.

నా టీ డబ్బులు ఆమెకివ్వనా?

అతనికోసమా నా 'టీ'ని వొదులుకున్నది? అపాత్రి దానమన్నారు పూర్వులు.

private charity నిష్ప్రయోజనమన్నారు నవీనులు.

కాని నిన్నటి ఆమెభర్త నా సిగరెట్ పెట్టె దొంగతనం మానేస్తాడా, ఎన్ని సిగరెట్ పెట్టెలు దానమిచ్చినా! ఎనార్కిజం రానీ.

ఈ బిచ్చగాళ్లు! social parasites,

ఈ బ్రాహ్మలు, యీ బైరాగులు, యీ గురువులు, యీ రుషులు!

Idlers సోమరి పోతులు.

వీళ్లందర్నీ, కాడికికట్టి...తోలి, పనిలో పెట్టాలి. ఎందుకు పని?

దేశ సమృద్ధికి.

ఎందుకు సమృద్ధి!

దేశాల డాబులు, దేశాల superiorities, vanities, cupidities దాసికి.

ఎందుకు పని?

మీరు హాయిగా కూచుంటే,

గుమాస్తాలం, కూలీలం, సోల్జర్లం, కరణాలం, సాహుకార్లం, మేమెందుకు పనిచెయ్యాలి?

వొద్దు, చెయ్యకండి.

మీరు పనిచేస్తే, మాకేమిచ్చారు? కష్టించారు, ఫలించారు. మాకేం, వొద్దు. Brother and comrade, వొద్దు. పని చెయ్య వొద్దు, రా, రా, నాయనా. రా, రా. పోదాం. రోడ్డుమీదికి. దాచుకున్నది అట్టా పారేసి రా.

డబ్బులు, ధాన్యాలు, పటాలు, వీకులు, శాస్త్రాలు... పంచలు - గొడ్లు, తాయెత్తులు.

మాకు పనీ వొద్దు. పదార్థాలూ వొద్దు.

నీకూ వొద్దు, నిన్ను చెయ్యమన్నానూ, రా.

రైళ్ల దగ్గిర, సినిమాల దగ్గర, హోటళ్ల దగ్గిర, బస్సుల దగ్గిర, ...ఎక్కడా వీళ్లే, రైళ్లు బస్సులు ఎక్కేవాడా, సినిమా చూసే వాడా, ఫలహారాలు తింటేవాడా, కిళ్లీలు నమిలే వాడా, ఏం లేనివాళ్లు 'ఇస్తావా' అని చెయ్యిజాచే యీ స్వతంత్రులు - నిర్భయులు. ఎంత ఇబ్బంది వాళ్లని చూడడం — ఎంత బాధ నీ జేబులో సొమ్ము, నీ కండువా జరీ, నీ చేతివాచీ వెండి - ఎంత బాధ!

మంచి సంతుష్టితో తిననీరా వీళ్ళు నిన్ను!

"నాకేం హక్కు వుంది?" అనే సత్యాన్ని ఎక్కణ్ణించో తెలుసుతారా నీలో,

కాళ్లుపట్టి, అబద్ధాలాడి, దొంగతనంగా తెచ్చి, బజావుగా మోసిన కానీని నీ సొంత కానీని అడుగుతున్నారా?

మా ఇంటి ఎదురు 'లాయరు' - తన నేలసాంతం పెర్చి ఎదిగిన వేపచెట్టు పుడకని - అడిగితే,

"నీ తాతసొమ్మా!" అంటున్నాడు.

తన నేలలో వూరిన బావినీటిని, తన మనమడికోసం నిలవ వుంచుతున్నాడు.

ఎంత బాధ నీకు? ఈ పిచ్చిగాళ్లు - హాయిగా ఎండలో మాడి, చలిలో వొణికి,

కాని మహారాజులమల్లే, గర్వంగా, నీ లెక్క లేకుండా తను నీకు అప్పిచ్చినట్టు, కానీ 'ఇయ్యి' అంటున్నదా పని - మనిషి - రక్తం - నరాలు - స్వేచ్ఛ - ఎవరు విలువ కడతారు?

పుట్టింది మొదలు ఒకటే ఏకరువు పెట్టే నిద్రల లెక్చరరికి గంటకి అయిదు రూపాయలు -

వోటుపెట్టెలు మార్చి తక్కువెక్కిన నక్కకి నెలకి మూడు వేలు -

నిజంగా నరాలు పిండి, రక్తం వుడుకెత్తి, వ్రాసిన సొమ్ము విలిన వ్యాసాలకి; కథలకీ; కవిత్వాలకి పోస్టేజీ ఖర్చు.

పెళ్ళిళ్లు... పెళ్లిలో అడ్డాలు యీ బిచ్చగాళ్లు, బైరాగులు రౌడీలు...

తిండిట... నాకూతురు పెళ్లికి, నీళ్లకి తిండిట! తంతే, తరిమితే, కైమలో వేస్తే...

శోభనం గదిముందు - పెళ్ళాలులేని బీదవాళ్లు - పులిస్తరాకుల కోసం -

పూవుల పరిమళాలు - పలహారాలు -

పరీక్షకుర్కా, దోమా; చేసేపనికి అంతఖర్చు! అందరూ కలిసి శోభనం కూతుర్నెత్తుకుపోతే! సిగ్గులేదు.

"మా అమ్మాయికి గర్భాదానమండి ... 'మీరు భోజనానికి' సిగ్గులేదూ?

"గర్భాదానానికి అల్లుడికి ఏమిచ్చారు? అయిదు వొందలు, ఎంత కష్టం? అయిదు వందలకే వొప్పుకున్నాడా? నేనైతేనా? సరే లెండి. నాకెందుకు? భోజనం పెట్టండి అరేచాలు" ఇన్ని ఘోరాలు జరుగుతున్నా పెళ్లిళ్ళన్నా, గర్భాదానాలన్నా సంతోషం విడవదు. భోజనాలు - మేళాలు - భోగంమేళాలు -

భోగంమేళాలు, out of fashion. వీరేశలింగంగారి ఆత్మ యింకా ముక్కాలుపీటల్ని కదిలిస్తోంది.

నాటకం మేళాలు - కొత్త fashion - సంసార నాటకాలు. వూరేగింపుల వెంబడి నాటకాలు - ఇంకో రెండు వందలు ఎక్కువ ఇస్తే సరి. మాది భోగంమేళం కాదు - సంసారిక ఉద్యోగస్తుల నాటకంమేళం.

ఎదో వొకవిధం - ఆడది దగ్గరకి రావాలి - రంగుపూసుకునే ఆడది మరీ రంగుగా వుంటుంది.

పెళ్లి అయితేనేం, చావు అయితేనేం?

చావు యేడుపుల ఉద్రేకంలో ఇదే సమయమని ఒకరిమీద పడి పమిట తొలిగించి వొత్తుకోడం...

పెళ్లిళ్లలో - నృత్యాలు - నృత్యంచేసే భాగాలకోసం —

హృదయేశ్వరీ విరహం భరించలేక, నవ్వేస్త్రీల తొడలు తడిసేట్టు కన్నీళ్లు

పోనీ ఓ బౌద్ధబిక్షు కాళ్లోపం పెట్టి, బిక్షుకులని ఆహ్వానిద్దాం.

అసలే ముసలిపులి, పళ్లూడాయి - లేచే శక్తిలేదు. కవిత్వపు బంగారు కడియాలు చూసి పిలిస్తే... ఎన్ని అగచాట్లు...అబద్ధాలు. స్త్రీలని పట్టాలా చదువున్న స్త్రీలని, రిబ్బన్ల పిల్లల్ని, లెక్చరర్లేడీలని, ఎట్లాగన్నా...

సినీమాకథల్లో కాపలించుకోగాలేనిది, నేనేం తీసిపోయినాను? నాబోర్రాగ్రి, జరంతో చిన్నదయింది యీమధ్య...నీ భర్త పోయినాడా! నేనున్నానుగా! అమ్మాయీ! పిచ్చిదానా! నా చేతివంక చూడకు.

దిగులా!

ఏం లేదులే - ఏం చెయ్యటంలేదు,

ఏదో పోయినవాళ్లు పోయినారు - వున్నవాళ్లవంక చూడు.

ఎంత సొమ్ము పూనుకున్నానో. ఇట్లా వాసన మూడు. దెబ్బలు కూడా తిన్నాను. అయ్యో నేనేం చెయ్యలేదు, అంత చిన్నపిల్ల నాకెందుకు?

పెళ్లిళ్లల్లో మేళాలు మరీ వీలు.

నాటకాలు సాగని రోజుల్లో - యీ మేళాలకన్నా పోతే- జమీందారులు, వర్తకులు,

ఏం చేస్తారా

నవీన స్త్రీకి emancipated woman కి కావాలి వొంటి నిండా, వొంటి యిరుకుల్లో - పరిమళాలు - పొగడ్తలు, lime-lights, హృదయ భంగాలు,

తాము తామని, తిరగడాలు - 'ఎంత చిన్నవారండీ - మీ మనమరాలుకన్న మీరే చిన్న, మీరే చాక.'

చలం - ఎంత గొప్ప స్త్రీలని తయారుచేశావు? వాళ్ళని వెంబడించే ఎంతటి దొంగల్ని!

